ఆదివారం
sunday magazine
19 మార్చి 2017
ఆంధ్రజ్యోతి



# అమెరికాలో అంతా క్షేమమేనా!

'సరోగసీ' ద్వారా ఒక బిడ్డకు తల్లి కావడం, తండ్రి కావడం అనే ట్రెండ్ ఇటీవల సెలబ్రిటీల్లో ఎక్కువయ్యింది. బాలీవుడ్‌లో అద్దె గర్భాల ద్వారా పిల్లల్ని కోరుకుంటున్న వారి సంఖ్య క్రమక్రమంగా పెరుగుతోంది. 44 ఏళ్ల మోస్ట్ ఎలిజిబుల్ బ్యాచిలర్‌గా పేరున్న కరణ్‌జోహార్ 'సరోగసీ' ద్వారా ఇటీవల ఇద్దరు పిల్లలకు తండ్రి కావడం చర్చనీయాంశంగా మారింది. అలాంటి మరికొందరి పిల్లల్ని ఒకసారి గుర్తుచేసుకుందాం.

# ఈ పిల్లలు ప్రత్యేకం!

## మంచు వారింట్లో...

'దేవుడు ఎంతో దయామయుడు. నా కూతురు సరోగసీ ద్వారా ఒక ఆడశిశువుకు తల్లయ్యింది. నా జీవితంలో ఇది మర్చిపోలేని సందర్భం' అని మోహన్‌బాబు 2014లో తన కూతురు మంచు లక్ష్మి గురించి ట్వీట్ చేశారు. మంచు లక్ష్మి, ఆండీ శ్రీనివాసన్‌ల పెళ్లి 2006లో జరిగింది. పిల్లలు లేరని అనేక ఏళ్ల బాధపడ్డాక చివరికి అహ్మదాబాద్‌లో గర్భాన్ని అద్దెకు ఇచ్చిన ఒక తల్లి ద్వారా బిడ్డను పొందారు. " ఐవిఎఫ్ ప్రక్రియలో కొన్ని సైకిల్స్ ఫెయిలయ్యాయి. అనేక ప్రయత్నాల తర్వాత ప్రయోగం ఫలించి ఆడపిల్ల మా ఇంట్లో అడుగుపెట్టింది" అని చెప్పింది మంచులక్ష్మి.

## ముచ్చటగా ముగ్గురు

నలభై ఏళ్ల వయసులో శిరీష్ కుందర్‌ను పెళ్లి చేసుకున్న ప్రముఖ డాన్స్‌డైరెక్టర్ ఫరాఖాన్ సహజంగానే తల్లవ్వాలని కలలు కన్నది. అయితే తన కోరిక నెరవేరదని తెలిసి రెండేళ్ల తర్వాత అద్దెగర్భం వైపు మొగ్గుచూపింది. 2008 ఫిబ్రవరిలో ఒకే కాన్పులో ఒక మగబిడ్డ, ఇద్దరు ఆడపిల్లలకు (ట్రిప్‌లెట్స్) తల్లయింది. వారికి సీజర్, దివా, అన్య అని పేర్లు పెట్టుకుంది. "ఆలస్యంగా పెళ్లి చేసుకోవడం వల్ల పిల్లలు పుట్టరనుకున్నా. కానీ ఐవిఎఫ్ ద్వారా నేను ఒకేసారి ముగ్గురు పిల్లలకు తల్లినయ్యా" అని ఆనందపడింది ఫరా.



## కరణ్ జోహార్ 'ట్విన్స్'

తుషార్‌కపూర్ తర్వాత పెళ్లిచేసుకోకుండానే తండ్రయిన సెలబ్రిటీగా కరణ్‌జోహార్ వార్తల్లోకి ఎక్కాడు. ఇటీవలే సరోగసీ ద్వారా ఇద్దరు పిల్లలకు (ఒక బాబు, ఒక పాప) తండ్రయ్యాడు కరణ్. మగబిడ్డకు యష్ జోహార్ అని, ఆడపిల్లకు రూహీ జోహార్ అని తన తల్లిదండ్రుల పేర్లు పెట్టుకున్నాడు. తన బిడ్డలకు అద్దెగర్భాన్నిచ్చిన తల్లికి, ఇలాంటి అద్భుతాలను ఆవిష్కరించిన వైద్యశాస్త్రానికి ఈ సందర్భంగా కృతజ్ఞతలు తెలిపాడు.



ఫిల్మ్ నగర్

## అమీర్ పుత్రరత్నం 'ఆజాద్'

అద్దెగర్భం ద్వారా ఒక బిడ్డకు తల్లిదండ్రులు అవుతున్నట్టు 2011 డిసెంబర్‌లో అమీర్, కిరణ్‌రావులు బహిరంగంగా ప్రకటించి అందర్నీ ఆశ్చర్యపరిచారు. సరోగసీ ద్వారా బిడ్డను కన్న తొలి సెలబ్రిటీ పేరెంట్స్‌గా వారు గుర్తింపు పొందారు. ఆ పిల్లాడికి ఆజాద్‌గా నామకరణం చేశారు. కిరణ్‌రావుకు గర్భాశయ సమస్యలుండటంతో వైద్యుల సలహా మేరకు అమీర్ దంపతులు ఐవిఎఫ్ సరోగసీ ద్వారా బిడ్డను కన్నారు. "ఈ బిడ్డ మాకు ప్రత్యేకం" అంటారు వాళ్లెప్పుడూ. అమీర్‌కు తొలి భార్య రీనా ద్వారా జునైద్, ఇరా అనే ఇద్దరు పిల్లలున్న విషయం తెలిసిందే.

## సింగిల్ డాడ్ 'లక్ష్య'ం

పెళ్లి చేసుకోకుండానే ఒక బిడ్డకు తండ్రి అవుతానని బహిరంగంగానే ప్రకటించిన తుషార్‌కపూర్ గత యేడాది ఐవిఎఫ్ ద్వారా ఆ విధంగానే తండ్రయ్యాడు. ఆమెకు 'లక్ష్య' అని పేరుపెట్టుకున్నాడు. లక్ష్యను అతడి తల్లిదండ్రులు జితేంద్ర, శోభాకపూర్‌లు కూడా స్వాగతించారు. 'తమ ఇంట్లో కోడలు కాలుపెట్టకపోయినా, మనవరాలు అడుగు పెట్టింద'ని గొప్పగా చెప్పుకున్నారు.



## షారుక్ ముద్దుల కొడుకు 'అబ్‌రామ్'

ఆర్యన్, సుహానా ఉన్నా మరో బిడ్డ కావాలనుకున్నారు షారుక్‌ఖాన్, గౌరీ దంపతులు. అయితే రెండేళ్లపాటు గౌరీకి ఇతర ఆరోగ్య కారణాల వల్ల ఆ కోరిక నెరవేరలేదు. చివరికి అద్దెగర్భం ద్వారా బిడ్డను కనాలని నిశ్చయించుకున్నారు. 2013 మేలో సరోగసీ ద్వారా పుట్టిన మగబిడ్డకు 'అబ్‌రామ్' అని పేరు పెట్టారు.



INSIDE





**అమెరికాలో అంతా క్షేమమేనా!**

అగ్రదేశానికి ట్రంప్ అధ్యక్షుడైన తర్వాత జాత్యహంకారం బుసలు కొడుతోందని వార్తలు వినిపిస్తున్న వేళ... అమెరికాలోని తెలుగు వారేమంటున్నారు.

7



**విజయ్ దేవరకొండ**

'పెళ్లిచూపులు' సినిమాతో యువతకు తెగ నచ్చేసిన హాండ్సమ్ హీరో విజయ్ దేవరకొండ చెబుతున్న విశేషాలు...

12



## మిత్రవాక్యం

'అబ్బ ... ఎంత తెల్లగా ఉన్నావు! నీ అంత అదృష్టవంతులు ఇంకెవరూ లేరేమో' అంది ఒక కాకి బాతును చూసి.

'నేనూ అలాగే అనుకున్నాను. కాని చిలకను చూశాక నా అభిప్రాయం మారిపోయింది. నా తెలుపు కంటే ఆకుపచ్చ, ఎరుపులతో కూడిన దాని అందం ఇంకెంత బాగుంటుందో' అంది బాతు.

కాకి తోటలన్నీ గాలించి చిలకను వెతికి పట్టుకుంది.

'అందరికంటే అందమైన పక్షివి నువ్వేననుకుంటా. ఎలాంటి అవహేళనలూ ఎదుర్కోకుండా నీ జీవితం హాయిగా గడిచిపోతూ ఉండి ఉంటుంది' అంది.

చిలక విచారంగా మొహం పెట్టి 'నెమలిని చూసే దాకా నేనూ అలాగే అనుకున్నాను. కాని కళ్లు చెదిరే దాని రంగుల ముందు నేనే పాటి?' అంది.



వెంటనే కాకి నెమలిని వెతుక్కుంటూ వెళ్లింది. నెమలి ఒక గుట్ట మీద పొదల వెనకాల నక్కి ఉండడం చూసింది.

'చిలక చెప్పింది నిజమే. నీ రంగుల సౌందర్యం ముందు ప్రతి పక్షీ దిగదుడుపే. నిన్ను చూడాలని చాలామంది కోరుకుంటారనుకుంటా. చాలా అదృష్టవంతురాలివి' అంది.

'చాలాకాలం నేనూ అదే భ్రమల్లో ఉన్నాను కాని స్వేచ్ఛ లేని సౌందర్యానికి విలువేముంది? నా అందాన్ని చూసి ఆనందించి ఊరుకోరు కదా మానవులు! నా ఈకలు లాగాలని, వాళ్ల ఇంట్లో కట్టేసుకోవాలని చూస్తారు. అందుకే నేను మనుషులు కనబడితే పారిపోతుంటాను. నీ లాంటి స్వేచ్ఛ కోసమే ఇప్పుడు నా ఆరాటమంతా' అంది.

కాకికి ఏం మాట్లాడాలో తెలియలేదు.

## ప్రియమైన 'ఆంధ్రజ్యోతి'కి...

### • 'అదుపు' ఓ బాధ్యత

ఈ వారం కథ 'అదుపు' చాలా బాగుంది. మారుతున్న సామాజిక పరిస్థితుల వల్ల పిల్లల పెంపకం ఎంత క్లిష్టంగా మారిందో వివరిస్తూనే... 'అదుపు కోల్పోయి అదుపు సాధించలేం' అంటూ ఒక్క మాటలో పిల్లలతో తల్లిదండ్రులు ఎలా ఉండాలో చక్కగా వివరించారు రచయిత. అతి గారాబం చేసినా... క్రమశిక్షణ పేరుతో వారి స్వేచ్ఛకు సంకెళ్లు వేసినా కష్టమే. రామాయణంలోని సీతా లక్ష్మణుల బంధాన్ని... తల్లీ బిడ్డల అనుబంధంతో ముడిపెట్టిన విధానం బాగుంది. మంచి కథను అందించిన శ్రీవల్లీ రాధిక గారికి అభినందనలు.

**- యు.వి. రత్నం**, ఒంగోలు
**నవతా భాస్కరరావు**, పాలకొల్లు

### • హరివిల్లులా మెరిసింది

సరికొత్త రంగులతో... అదనపు హంగులతో ముస్తాబై వచ్చిన ఈ వారం ఆదివారం ఆంధ్రజ్యోతి తొలికరి జల్లుతో పాటు వచ్చే హరివిల్లులా ఉంది. కంటెంట్‌లోనే కాదు... కలరింగ్‌లో కూడా పోటీ లేరని నిరూపించారు. ఈ వారం పత్రికను చూస్తుంటే మంచి కథనం ఉన్న సినిమాకు కమర్షియల్ హంగులను జోడిస్తే ఎలా ఉంటుందో... అంత బాగుందనిపించింది.

**- సురేష్**, వనస్థలిపురం

### • సగమేనా...!

ఈ వారం కవర్‌స్టోరీ 'సముద్రంలోనూ సగం మేమే...' చాలా బాగుంది. పురుషాధిక్యత ఎక్కువగా ఉండే రంగాలలో కూడా నేటి తరం ఆడవాళ్లు తమ ఉనికిని చాటుకుంటుండడం గర్వంగా అనిపిస్తోంది. నావికా దళంలో వివిధ హోదాల్లో విధులను నిర్వహిస్తున్న అమ్మాయిల గురించి తెలియజేసిన విషయాలు నాలాంటి ఎందరో ఆడవాళ్లకు మార్గదర్శకంగా నిలుస్తాయి.

**- సాహిత్య**, హైదరాబాద్

### • కొత్తగా వ(న)చ్చింది

కొత్తగా వచ్చిన ఆదివారం అనుబంధం మాకెంతో నచ్చింది. బుద్ధుని పన్నును భద్రంగా దాచిన దేవాలయం ఉందని 'దైవమ్' చదివి తెలుసుకుని ఆశ్చర్యపోయాం. పిల్లల 'బాలజ్యోతి' పేజీలను సప్త వర్ణాలతో నింపడం హైలైట్‌గా నిలిచింది.

**- ప్రకాశ్**, కాకినాడ

### • ఎంతో ఉపయోగకరం

ఈ వారం ఆదివారం ఆంధ్రజ్యోతిలో ప్రవేశపెట్టిన 'పేరెంటింగ్' శీర్షిక చాలా బాగుంది. పిల్లల పెంపకం గురించి తెలియజేసేందుకు ఒక ప్రత్యేక శీర్షికను తీసుకు రావడం చాలామంది తల్లిదండ్రులకు ఉపయోగపడుతుంది. నిపుణుల సలహాలు పాటిస్తే టెన్షన్‌కు దూరంగా ఉండొచ్చు.

**- సుధీర్**, శంకరపల్లి

# ఈత నేర్చిన బస్సు

తళతళా మెరిసిపోతోన్న ఒక బస్సును చూసి చటుక్కున ఎక్కి కూర్చున్నారు ప్రయాణికులు. నల్ల త్రాచులాంటి తారోడ్డుపై బస్సు మెత్తగా పోతుంటే సుఖంగా కళ్లు మూసుకున్నారు. ఇంతలో వాళ్ల దారికి అడ్డుగా గలగలల సెలయేరు అడ్డొచ్చింది. వంతెన పై నుంచి ఆ సెలయేటి అందాన్ని చూద్దామనుకున్న ప్రయాణికులను నిర్ఘాంతపరుస్తూ... డ్రైవరు నేరుగా ఆ సెలయేటిలోకే బస్సును పోనిచ్చాడు. అతగాడు నిద్రమత్తులో పోనిస్తున్నాడా ఏమి? అనుకుంటున్నంతలోనే బస్సు మోటారుపడవలా నీటిలో దూసుకుపోవడం మొదలుపెట్టింది. వారి ఆశ్చర్యాలకు, సందేహాలకు అడ్డుకట్ట వేస్తూ... గైడ్ అది ఈత నేర్చిన బస్సని చెప్పి వారి కలత తీర్చాడు. ఇదంతా ఎక్కడ జరిగిందో చెప్పలేదు కదా! జర్మనీలోని హ్యాంబర్గ్‌లో.

బస్సేంటి... పడవలా నీటిని చీల్చుకుపోవడమేంటి అనుకుంటున్నారా? హ్యాంబర్గ్ నగర పాలకులు పర్యాటకులను ఆకట్టుకునేందుకు రోడ్డుపైనే కాక నీటిలోనూ ప్రయాణించే బస్సు కావాలని కోరితే... బుడాపెస్ట్‌కు చెందిన 'స్విమ్‌బస్' కంపెనీ వారి కోరిక మేరకు ఇలా నీటిలోనూ ఈదులాడే బస్సును తయారు చేసి ఇచ్చింది.




# సముద్రాన్ని ఊడ్చేద్దాం!

ఈ మాట అన్నప్పుడు బోయన్ స్లాట్ వంక చాలామంది వింతగా చూశారు. కానీ త్వరలోనే 17 ఏళ్ల ఈ డచ్ కుర్రాడి ఆలోచనలతో వందమంది యువ ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు ఏకీభవించి అతడు స్థాపించిన 'ది ఓషన్ క్లీనప్ ప్రాజెక్టు'లో భాగమయ్యారు. హిందూ మహాసముద్రం, గ్రేట్ పసిఫిక్, సౌత్ పసిఫిక్, నార్త్ అట్లాంటిక్, సౌత్ అట్లాంటిక్... ప్రాంతాల్లో ప్లాస్టిక్ వ్యర్థాలు భారీ ఎత్తున పోగుపడి ఉన్నాయని గుర్తించారు. మొదట పసిఫిక్ మహాసముద్రంలో వ్యర్థాలను శుభ్రపరచాలని నిర్ణయించారు. వ్యర్థాల కోసం సముద్రంలో జల్లెడ పట్టడం కష్టం కనుక మొదట వ్యర్థాలు మేట వేసి ఉన్న నీటిపై తేలియాడే ట్యూబులను ఏర్పాటు చేశారు. ఈ ట్యూబులు కొన్ని కిలోమీటర్ల మేర విస్తరించి ఉంటాయి. సముద్ర ప్రవాహాల దిశ మారినప్పుడల్లా ప్లాస్టిక్ వ్యర్థాలు పైకి తేలతాయి కదా... అవి మరో చోటుకు తరలిపోకుండా ఈ ట్యూబులు ఆపుతాయి. అలా సముద్ర తరంగాల దిశకు అనుగుణంగా ట్యూబులు కదిలేటట్టు అమర్చారు. తర్వాత ఈ వ్యర్థాలను చిన్న చిన్న పడవల ద్వారా సేకరించి సౌరశక్తితో పనిచేసే కన్వేయర్ బెల్టుల ద్వారా ఓడలోకి చేరుస్తారు. ఈ పద్ధతిలో పసిఫిక్‌లో ప్లాస్టిక్ వ్యర్థాలను పదేళ్లల్లో తీసివేయవచ్చని అంచనా వేస్తోంది బొయన్ బృందం.

2013లో సంస్థను స్థాపించినప్పుడే పక్కా ప్రణాళికతో పనులు మొదలుపెట్టారు ఓషన్ క్లీనప్ ప్రాజెక్టు సభ్యులు. 2014 చివరికి సాధ్యాసాధ్యాలను శాస్త్రీయంగా అధ్యయనం చేసి రిపోర్టు తయారు చేశారు. 2015లో ఆ రిపోర్టులను పట్టుకుని నిధులను సేకరించారు. అదే ఏడాది సముద్రంలో ప్లాస్టిక్ ఏ మేరకు విస్తరించిందనే పరిశోధన చేపట్టారు. ఉపగ్రహ ఛాయాచిత్రాల ద్వారా మరింత సమాచారాన్ని సేకరించారు. హవాయి దీవుల నుంచి కాలిఫోర్నియా వరకూ 30 నౌకలను పంపి... పసిఫిక్‌ను జల్లెడ పట్టి గత నలభై ఏళ్లలో పోగుపడిన వ్యర్థాల గణాంకాలను పక్కాగా సేకరించారు. 2016లో 'స్కేల్ మోడల్ టెస్టింగ్' ద్వారా సముద్ర జలాల్లో వ్యర్థాల సేకరణ ఎలా చేయాలన్నది ప్రయోగాత్మకంగా పరీక్షించారు. 2017లో పైలెట్ ప్రాజెక్టు చేపట్టారు. ఫిబ్రవరి 9 నాటికే ఒక టన్ను ప్లాస్టిక్ వ్యర్థాలను కూడా వెలికితీశారు. 2020 కల్లా పూర్తిస్థాయిలో పనులు ప్రారంభించాలనేది వారి సంకల్పం.

'లక్ష్యం క్లిష్టమైనది. సాధన ఊహకందనిది'... ఇవీ ప్రాజెక్టు ప్రారంభానికి ముందు వినిపించిన మాటలు. కానీ బొయన్ దీక్ష ముందు అవి తేలిపోయాయి. గత నెలలో విజయవంతంగా ప్రారంభమైన పైలెట్ ప్రాజెక్టు... స్వచ్ఛ కడలికి భరోసా ఇస్తోంది.









# సర్కార్- 3... ఒక సెన్సేషన్




రామ్‌గోపాల్ వర్మ దర్శకత్వంలో అమితాబ్ బచ్చన్ ప్రధాన పాత్రలో వచ్చిన 'సర్కార్', 'సర్కార్ 2' చిత్రాలు ఇప్పటికే సూపర్ హిట్ అయ్యాయి. ఇప్పుడు వాటికి కొనసాగింపుగా వస్తున్న 'సర్కార్ 3' సినిమా ట్రైలర్ మార్చి 2న విడుదలయింది. కేవలం నాలుగు రోజుల్లోనే 61 లక్షలకు పైగా వ్యూస్ సాధించి యూట్యూబ్‌లో కొత్త సెన్సేషన్ సృష్టించింది. రాహుల్ మిత్ర, ఆనంద్ పండిట్, గోపాల్ శివ్‌రామ్, కిషన్ చౌదరి, వీవన్ సంయుక్తంగా నిర్మించిన ఈ చిత్రానికి రవిశంకర్ సంగీతం అందించారు. అమితాబ్‌తో పాటు రోనిత్ రాయ్, జాకీష్రాఫ్ తదితరులు ప్రధాన పాత్రల్లో నటించారు. 'ఎ వూండెడ్ లయన్ ఈజ్ ది మోస్ట్ డేంజరస్' అనే పదాలతో మొదలయ్యే ఈ ట్రైలర్ రెండు నిమిషాల 53 సెకన్ల నిడివి ఉంటుంది. ఆద్యంతం ఆసక్తికరంగా రూపొందించిన ఈ ట్రైలర్‌లో "నువ్వు ఏ మంచిపని చేయాలన్నా దాని కోసం డబ్బు గాని, జ్ఞానం గాని ఇవాల్సి ఉంటుంది. ఒక్కోసారి చాలా బాధపడాల్సి కూడా ఉంటుంది. అలాగే ఎవరినైనా బాధపెట్టినప్పుడు దానికి కూడా మూల్యం చెల్లించాల్సి ఉంటుంది", "నాకు ఏది కరెక్ట్ అనిపిస్తే అది చేస్తా. నేను అనుకున్నది చేయడానికి దేవుడికి వ్యతిరేకంగా వెళ్లడానికైనా... సమాజానికి... పోలీసులకు... లా అండ్ ఆర్డర్‌కు... ఆఖరికి పూర్తి సిస్టమ్‌కే వ్యతిరేకంగా వెళ్లడానికైనా వెనుకాడను" అని అమితాబ్ హిందీలో చెప్పే డైలాగులు బాగున్నాయి. ఈ చిత్రం ఏప్రిల్ 7న విడుదలవుతోంది.

## 'పైరేట్స్‌కు...' అదే ఆదరణ

గుప్తనిధుల కోసం సముద్ర మార్గంలో అన్వేషణ సాగించే ఒక సముద్ర దొంగల గుంపు, వారిని నడిపించే ఒక విచిత్ర నాయకుడు... సముద్రంలో వారికి ఎదురయ్యే సమస్యల నుంచి వాళ్లు ఎలా బయటపడి, నిధులను గెలుచుకున్నారనేది టూకీగా 'పైరేట్స్ ఆఫ్ ది కరీబియన్' సిరీస్ సినిమాల్లో ఉండే కథ. ఇప్పటికే నాలుగు భాగాలు విడుదలయిన ఈ చిత్రం ఐదో భాగం 'పైరేట్స్ ఆఫ్ ది కరీబియన్- డెడ్ మెన్ టెల్ నో టేల్స్' ట్రైలర్ మార్చి 2న విడుదలయ్యింది. 4 రోజుల్లోనే 86 లక్షలకు పైగా వ్యూస్ సాధించి దూసుకుపోతోంది. సముద్ర దొంగలకు చెందిన బ్లాక్‌పర్ల్ అనే నౌకకు జాక్ స్పారో కెప్టెన్. అతని చేతుల్లో మోసపోయి సర్వస్వం కోల్పోయిన విల్ టర్నర్ పగ తీర్చుకునేందుకు తిరిగి రావడంతో ఈ ఐదో భాగం కథ మొదలవుతుంది. జానీ డెప్, కెవిన్ మెక్‌నాలీ, జియోఫ్రే రష్, ఆర్లాండో బ్లూమ్ ప్రధాన పాత్రల్లో నటించారు. జోచిమ్ రోనింగ్, ఎస్పెన్ సాన్‌బర్గ్ కలిసి దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి జెర్రీ బ్రక్‌హైమర్ నిర్మాత. 2015 లోనే విడుదల కావాల్సిన ఈ చిత్రం వివిధ కారణాల వల్ల వాయిదాలు పడుతూ 2017, మే 26న విడుదలకు సిద్ధమైంది.






## 'కృష్ణమూర్తి గారింట్లో'.. ఏం జరిగింది?

ఆరోగ్యం బాగోలేని తండ్రి కోరికపై గోవా ట్రిప్‌ను రద్దు చేసుకుని... ఆయన స్నేహితుడు కృష్ణమూర్తి గారిని కలిసేందుకు ఒక పల్లెటూరికి పయనమవుతాడు హీరో. అక్కడ ఒకమ్మాయి తారసపడుతుంది. ఆ అమ్మాయి తండ్రినే కలవడానికి వచ్చానని తెలుసుకుని సంతోషిస్తాడు. అనుకోని పరిస్థితుల్లో నాలుగు రోజులు అక్కడే ఉండిపోవాల్సి వస్తుంది. 'కృష్ణమూర్తి గారింట్లో' అతను ఎదుర్కొన్న పరిస్థితులు ఏంటి? కృష్ణమూర్తికి, తన తల్లికి ఉన్న సంబంధం ఏంటి? కృష్ణమూర్తి ఎందుకు పెళ్లి చేసుకోకుండా ఉండిపోయాడు? అతని కూతురుగా పెరుగుతున్న శ్రీయాంక ఎవరు? తెలియాలంటే 'కృష్ణమూర్తిగారింట్లో' లఘుచిత్రం చూడాలి. మనోజ్ కృష్ణ తన్నీరు, దర్శిని శేఖర్, అప్పాజీ అంబరీష ప్రధాన పాత్రల్లో నటించిన ఈ చిత్రానికి లక్ష్మణ్ కె. కృష్ణ దర్శకత్వం వహించారు. చక్రి వానిమిశెట్టి నిర్మాత. హీరో హీరోయిన్ల మధ్య సాగే చిన్న లవ్ ట్రాక్‌తో పాటు హీరో, కృష్ణమూర్తి పాత్ర మధ్య ఉండే సన్నివేశాలు కూడా ఆసక్తికరంగా ఉంటాయి. 38 నిమిషాలు ఉండే ఈ లఘుచిత్రం ఇప్పటికే 13 లక్షలకు పైగా వ్యూస్ సాధించింది.

## అవునా!

- పెరు దేశంలో ఉన్న ఒక బిల్‌బోర్డు గాల్లోంచి తాగే నీటిని తయారు చేస్తుంది.
- ఫ్రాన్సులో చనిపోయిన వాళ్లను కూడా పెళ్లి చేసుకోవచ్చు. దాన్ని చట్ట బద్ధంగానే భావిస్తారు.
- ప్రేమలో పడతానని భయపడటాన్ని 'ఫిలో ఫోబియా' అంటారు.
- మొదటిసారి చంద్రుడి పైకి వెళ్లిన ల్యాండ్ వ్యోమనౌక 'అపోలో 11' ఇంక 20 సెకన్లలో ఇంధనం అయిపోతుందనగా చంద్రుడి పై దిగింది. భూమికి తిరిగి రావడానికి వేరే మాడ్యూల్ని ఉపయోగించారు.
- బొలీవియాలో పూర్తిగా ఉప్పుతో నిర్మించిన హోటల్ ఉంది. అక్కడ మంచాలు, కుర్చీలు కూడా ఉప్పుతో తయారైనవే!



- ప్రాచీన రోమ్‌లో మహిళలు గ్లాడియేటర్ల స్వేదాన్ని సౌందర్య సాధనంగా ఉపయోగించేవారు.
- ఉత్తర కొరియా, క్యూబా దేశాలు మాత్రమే కోకాకోలాను తమ దేశంలోకి అనుమతించలేదు.





> ఇదివరకటిలా 'పెళ్లిచూపులు'లో ఒకర్నొకరు చూసుకుని ఒక అభిప్రాయానికి వచ్చే తరం కాదు ఇది. అందుకే మీరు చూసే సంబంధం గురించి మీ అమ్మాయికి ప్రతి విషయం చెప్పండి.

# పెళ్లి వాయిదా వేస్తోంది




**ప్రశ్న : మా అమ్మాయికి పెళ్లి చేయాలనుకుంటున్నాం. కాని ఆ ప్రస్తావన తీసుకొచ్చినప్పుడల్లా ఉద్యోగంలో స్థిరపడాలి, ప్రమోషన్ రావాలి వంటి కారణాలు చెప్పేది. సరేలే అని కొన్నాళ్లు ఊరుకున్నాం. ప్రమోషన్ వచ్చాక కూడా వాయిదా వేస్తోంది. ఏం చేయాలి?**

ఎం. ఉదయశ్రీ, తిరువూరు

చదువు, ఉద్యోగం, పెళ్లి... ఈ మూడింటిలో నేటి యువత మొదటి రెండిటికే ప్రాధాన్యం ఇస్తోంది. మీ అమ్మాయి అలాగే ఆలోచిస్తున్నట్టుంది. అయితే మీ సుదీర్ఘ ఉత్తరం చదివిన తర్వాత 'తనకు తగిన సోల్‌మేట్ దొరుకుతాడా?' అని మీ అమ్మాయి బాగా కలవరపడుతున్నట్టు అర్థమైంది. 'నాకు కొన్ని వ్యక్తిగత లక్ష్యాలున్నాయి' అంటోందంటే 'కాబోయే భాగస్వామి వాటిని అర్థం చేసుకుని అండగా నిలబడతాడో లేదో అనే భయమేదో ఆ అమ్మాయికి ఉన్నట్టు అర్థమవుతోంది. ఇదివరకటిలా 'పెళ్లిచూపులు'లో ఒకర్నొకరు చూసుకుని ఒక అభిప్రాయానికి వచ్చే తరం కాదు ఇది. అందుకే మీరు చూసే సంబంధం గురించి మీ అమ్మాయికి ప్రతి విషయం చెప్పండి.

తర్వాత చూసుకోవచ్చులే అని చిన్న చిన్న విషయాల్లో కూడా ఫాల్స్ ప్రామిసెస్ చేస్తుంటారు కొందరు. మీరు అలా చేయకండి. ప్రారంభంలో చిన్నవే అయినా అవే ఒక్కోసారి పెద్ద పెద్ద ఘర్షణలకు కారణమౌతాయి. పెళ్లిచూపుల తర్వాత కూడా అబ్బాయి నచ్చితే ఇరు కుటుంబాలు రెండు మూడుసార్లు కలుసుకోవడం వల్ల వాళ్ల కుటుంబంపై మీ అమ్మాయికి ఒక అవగాహన రావచ్చు. మీరు 'ప్రీ మ్యారిటల్ కౌన్సిలింగ్'కి కూడా వెళ్లవచ్చు. ఇదొక ప్రత్యేకమైన థెరపీ. 'పెళ్లి' గురించిన సందేహాలను నివృత్తి చేస్తారు వాళ్లు. వివాహ బంధంలోకి అడుగుపెట్టిన తర్వాత ఇద్దరూ ఎలా నడుచుకోవాలి అనే విషయాలపై ఒక లోతైన అవగాహన కలిగిస్తుందీ కౌన్సిలింగ్.

**ప్రశ్న : మా అబ్బాయి ఎంబీయే (హెచ్ ఆర్) చేశాడు. ఏడాది తిరగకుండానే మూడు ఉద్యోగాలు మారాడు. 'ఎందుకు రా అలా చేస్తున్నావు?' అంటే 'నాకు నచ్చట్లేదు, నేను అకౌంటింగ్ వైపు వెళతాను' అంటున్నాడు. మొదటి నుంచి బిడియస్తుడు. మరి అక్కడైనా రాణించగలడా? ఇప్పుడు ఏం చేయాలి?**

కె. చంద్రశేఖర్, నరసాపురం

బిడియంగా ఉండటం వేరు. అంతర్ముఖుడి (ఇంట్రావర్ట్)గా ఉండటం వేరు. బిడియం ఉన్నవాళ్లు పెరిగే కొద్దీ బిడియాన్ని వదిలించుకుని అందరితో సరదాగా కలిసిపోతారు. కానీ అంతర్ముఖులకు అది సహజ స్వభావం. అది మారదు. మీ అబ్బాయిది కూడా బహుశా ఆ స్వభావం కావచ్చు. మీ అబ్బాయిని మొదటినుంచి శ్రద్ధగా గమనిస్తున్న కారణంగా అతని బలమేంటో, బలహీనత ఏంటో మీకే బాగా తెలుస్తుంది. దాన్ని తెలియజెప్పి గైడెన్స్ ఇచ్చే బాధ్యత ప్రధానంగా మీమీదే ఉంటుంది! సాధారణంగా పిల్లల్లో రెండు రకాల ప్రజ్ఞలుంటాయి. మొదటిది పుట్టుకతో వచ్చేది. రెండోది సాధనతో అభివృద్ధి చెందేది. ఇతరులను ఆకట్టుకునేలా మాట్లాడడమనేది సహజంగా వస్తుంది. వాళ్లకు తమ మాటలతో ఇతరులను ఒప్పించగల ప్రజ్ఞ ఉంటుంది. అలాంటివాళ్లు మార్కెటింగ్, సైకాలజీ, లా... వంటి ప్రొఫెషన్స్‌ని ఎంచుకుంటే రాణించగలుగుతారు. అలా కాకుండా ఒక అంతర్ముఖుడిని తీసుకెళ్లి మానవ వనరుల విభాగంలో కూర్చోబెడితే అతడు రాణించలేకపోవచ్చు. మీ అబ్బాయి ఆసక్తి ఆర్థిక అంశాలపైన అని అర్థమౌతోంది కదా! కాబట్టి అతడి ఆసక్తి ప్రకారం అకౌంటింగ్‌లో బ్రిడ్జ్ కోర్సు చేసి అటు వైపు వెళ్లమని ప్రోత్సహించండి. 'ఇప్పుడు కెరీర్ మార్చుకోడమా?' అనే సందేహం వద్దు. నచ్చని కెరీర్‌లో బలవంతంగా జీవితాంతం కొనసాగడం కంటే... నచ్చే కెరీర్ కోసం కొంత అదనపు కాలం వెచ్చించడంలో తప్పు లేదు. అదే ఉద్యోగంలో కొనసాగితే తనతోటి వాళ్లు తనను మించిపోవడం చూసి 'కెరీర్‌లో ఫెయిలయ్యాను' అని బాధపడతాడు. అది మరిన్ని వైఫల్యాలకు దారి తీస్తుంది. కెరీర్ డైలమాలో ఉన్న మీ అబ్బాయికి ఇప్పుడు మీ నుంచి కావాల్సింది నైతిక మద్దతు. అతడికి కొంత సమయం ఇచ్చి ఆసక్తి ఉన్న రంగం వైపు ప్రోత్సహించండి.




**సుజాతా రాజమణి**
కన్సల్టెంట్ సైకోథెరపిస్ట్,
కిమ్స్ హాస్పిటల్


మీ పిల్లల ప్రవర్తనకు సంబంధించి ఏమైనా ప్రశ్నలుంటే మాకు పోస్ట్‌లో గానీ, మెయిల్‌లో గాని పంపవచ్చు.


**అడ్రస్ :** ఆదివారం ఆంధ్రజ్యోతి, రోడ్ నెం. 70, జూబ్లీహిల్స్, హైదరాబాద్- 33, **మెయిల్ ఐడి :** sunday.aj@gmail.com

కవర్ స్టోరీ

**కాన్సస్‌లో కూచిభొట్ల శ్రీనివాస్ అనే తెలుగు ఇంజనీర్ హత్య.**
**వాషింగ్టన్‌లోని కెంట్ ప్రాంతంలో దీప్‌రాయ్ అనే సిక్కుపై కాల్పులు.**
**దక్షిణ కరోలీనాలో హర్నీష్ పటేల్ హత్య.**

అగ్రదేశానికి ట్రంప్ అధ్యక్షుడైన తర్వాత జాత్యహంకారం బుసలు కొడుతోందని వార్తలు వినిపిస్తున్న వేళ... వీసాల వివాదం రోజురోజుకు ముదురుతున్న వేళ... అమెరికాలో ఉన్న భారతీయులు అభద్రతతో సతమతమవుతున్న వేళ... వరుసగా జరిగిన ఈ మూడు సంఘటనలు భారతీయులను తీవ్ర భయాందోళనలకు గురిచేశాయి. ఎప్పటిలాగే అమెరికా వైపు ఆశగా అడుగులు వేయాలని చూస్తున్న విద్యార్థులు, ఉద్యోగార్థులు ఒక్కసారిగా ఉలిక్కిపడి పునరాలోచన చేస్తున్న తరుణమిది. అమెరికాకు వెళ్లాలా? వద్దా? అమెరికాలో భారతీయులకు సేఫ్టీ ఉంటుందా? లేదా?

ఇక్కడి నుంచి దృశ్యం ఎర్ర రంగులో తీవ్రంగా కనిపిస్తున్నా అక్కడి వాళ్లు వీటిని ఎలా చూస్తున్నారు? 'భూతల స్వర్గాన్ని' మనం భూతద్దంలో చూసి ఎక్కువ భయపడుతున్నామా? ఇప్పటికిప్పుడు పెరిగిన విద్వేషమా? ఆర్థిక అంతరాలు పెంచి పోషించిన అసంతృప్తి ఫలితమా? ఈ అంశాలపై అమెరికాలో ఉంటున్న మనవాళ్ల మనోగతమే ఈ వారం కవర్‌స్టోరీ.



# అమెరికాలో అంతా క్షేమమేనా!

## భయంతో కాదు భద్రతతో మెలగండి



అమెరికా అధ్యక్షునిగా అమెరికన్ దేశస్థులకు ఉద్యోగాలు కల్పించడం, కాపాడటం, వారికి రక్షణ కల్పించడం డోనాల్డ్ ట్రంప్ ముఖ్య బాధ్యత. ఈ క్రమంలో కొంతమంది విదేశీయులకు, ముఖ్యంగా అమెరికాలో స్థిరపడ్డ భారతీయులకు ఉద్యోగరీత్యా నష్టం కలుగవచ్చు. స్థానిక అమెరికన్ల విద్యార్హత, ఉద్యోగ నైపుణ్యాలు ఎలా ఉన్నప్పటికీ తమకి రావాల్సిన ఉద్యోగాలు విదేశీయులు కొల్లగొట్టుకుపోతున్నారు అనే అభద్రతా భావం... వాళ్లల్లో విదేశీయుల పట్ల కొంత కరడుగట్టిన ద్వేషంగా మారడానికి ఒక ప్రధాన కారణం. ప్రస్తుత గణాంకాల ప్రకారం అమెరికన్ల జీవన విధానం చాలా ఒత్తిడితో కూడుకున్నదని, దాని వల్ల చాలామంది మానసికంగా బలహీనంగా తయారై ఒక్కొక్కప్పుడు తమకి తెలియకుండానే ఉన్మాదంగా ప్రవర్తిస్తారని తెలుస్తున్నది. కొన్ని కొన్నిసార్లు వాళ్లు చాలా అనాలోచితంగా తమ దగ్గర ఉన్న ఆయుధాలను విచక్షణారహితంగా వాడుతూ హింసకు పాల్పడుతున్నారు. అది వారి కుటుంబ సభ్యుల మీద కావచ్చు, స్కూలు పిల్లల మీద కావచ్చు, తమకు నచ్చని విదేశీయులపైన కావచ్చు, లేదా స్వయంగా తమ మీదే కావచ్చు. ఇలాంటి పరిస్థితుల్లో స్థానిక అమెరికన్లతో వ్యవహరించేటప్పుడు

**సిలికాన్ వ్యాలీలో ఉన్న ఐటీ సంస్థల్లో 15.5 శాతం భారతీయులు ప్రారంభించినవే.**

పరిహాసాలు, ఎగతాళి తగవు.

కొన్ని కొన్ని ప్రదేశాలకు భారతీయ అమెరికన్లు వెళ్లకపోవడమే మంచిది. దీనర్థం అమెరికాలో క్షణక్షణం భయపడుతూ బతకమని కాదు, అమెరికా చట్టాలను గౌరవిస్తూ భద్రంగా బతకమని నా సూచన. అమెరికా దేశవ్యాప్తంగా దేవాలయాలు, మసీదులు వందల సంఖ్యలో ఉన్నాయి. ఇది అమెరికాలో ఉన్న మతస్వేచ్ఛకు ప్రత్యక్ష నిదర్శనం. ఉన్న స్వేచ్ఛను జాగ్రత్తగా వినియోగించుకోవాలి కానీ దుర్వినియోగ పరచరాదు. దీపావళిని పెద్ద పండుగగా గుర్తించి, అమెరికా ప్రభుత్వం పోస్టల్ స్టాంపు విడుదల చేయడం హిందువులపై ఉన్న గౌరవానికి ఒక ఉదాహరణ. విద్యావేత్తలు, వైద్యులు, వ్యాపారవేత్తలు, ఐటీ నిపుణులు ఎందరో కార్పొరేట్ రంగంలో అత్యున్నత స్థానాల్లో స్థిరపడి అమెరికా ఆర్థిక ప్రగతికి తోడ్పడుతూ మంచి గౌరవ ప్రతిష్ఠలు తెచ్చుకున్నారు. ఇప్పుడు ఈ హింసాత్మక సంఘటనలు జరగడం కలవరం కలిగిస్తోంది. అయితే ఇలాంటివి జరిగినప్పుడు ఆవేశకావేశాలకు లోను కాకుండా సహనంతో, చాకచక్యంతో మెలగడం ఎంతో అవసరం.

**● డా. ప్రసాద్ తోటకూర**
ప్రెసిడెంట్, ఇండియన్ అమెరికన్ ఫ్రెండ్‌షిప్ కౌన్సిల్

## ఏకమై ఎదుర్కొందాం



విద్వేష వాతావరణం పెరుగుతున్న మాట నిజం. కూచిభొట్ల శ్రీనివాస్ హత్య తర్వాత కూడా కొన్ని సంఘటనలు నా దృష్టికి వచ్చాయి. ఇటీవల ఇక్కడ ఒక మిడిల్ స్కూల్‌లో భారతీయ విద్యార్థులను ఇతర విద్యార్థులు జాత్యంహకార వ్యాఖ్యలతో దూషిస్తున్నట్టు తెలిసి అనేకమంది తల్లిదండ్రులతో కలిసి నేనూ ఆ స్కూలుకు వెళ్లి యాజమాన్యంతో చర్చించాను. మా ఊర్లో 50-60 మంది స్త్రీలు ప్రతి శనివారం త్రోబాల్ ఆడతారు. వారిలో భారతీయులే ఎక్కువ. అంతమంది భారతీయులు ఒకచోట కనబడడం ప్రమాదకరమని భావించి కొంతకాలం పాటు ఈ ఆటలు ఆపేయాలని నిర్ణయించుకున్నారట వాళ్లు.

టెక్సాస్‌తో పోల్చితే కాలిఫోర్నియా లాంటి చోట్ల రేసిజం తక్కువని మొదట్లో భావించేదాన్ని కాని ట్రంప్ వచ్చాక ఇక్కడా మార్పు కనిపిస్తోంది. ప్రచార సమయంలో అతను నోటికి వచ్చినట్టు ఆరోపణలు చేస్తున్నా ప్రజలు స్పందించడం మానేశారు. కొంత కాలానికి నమ్మడం కూడా ప్రారంభించారు. అమెరికన్లలో నిరుద్యోగం ప్రబలేకొద్దీ మంచి ఉద్యోగాలన్నీ భారతీయులు కాజేస్తున్నారనే అభిప్రాయం బలపడింది. సత్య నాదెళ్ల, సుందర్ పిచ్చాయ్ లాంటి వాళ్లను చూసి అమెరికాలోని భారతీయులందరూ ఆ స్థాయిలోనే ఉన్నారనే అపోహలు పెరిగాయని కొందరి అభిప్రాయం. మరోవైపు ముస్లింలకు, ఆసియన్లకు తేడా చూడకపోవడం వల్ల అందరూ 'ఒసామా బిన్ లాడెన్' అనుయాయులైనట్లు భావించడమూ ఉంది.

ఏది ఏమైనా భారతీయులందరూ ఏకం కావాల్సిన తరుణమిది. ఈ విద్వేష చర్యలకు ప్రభుత్వం నుంచి జవాబుదారీతనం కోరుదాం. ఉగాది, సంక్రాంతి, బతుకమ్మ, దీపావళితో పాటు ఇక్కడి భారతీయులు వెటరన్స్ డే పెరేడ్, మార్టిన్ లూథర్‌కింగ్స్ డే పెరేడ్‌లలో కూడా పాల్గొని స్థానికులతో కలిసిపోవాల్సిన అవసరం ఉంది.

● **జయ బాడిగ,**
అటార్నీ, కమ్యూనిటీ ఆక్టివిస్ట్,
ఫొల్సోమ్, కాలిఫోర్నియా


కూచిభొట్ల శ్రీనివాస్

## పనిగట్టుకుని తెలుగువాళ్లమీద జరిగిన దాడి కాదు



కాన్సాస్ సంఘటనను భారతీయులకు వ్యతిరేకంగా సాగుతున్న వ్యవస్థాగత హింసగా చూడడానికి ఆధారాలేమీ లేవు. ముఖ్యంగా అమెరికాలో తెలుగువారిపై పనిగట్టుకుని హత్యాకాండ సాగిస్తున్నారన్న ప్రచారంలో వాస్తవం లేదు. మన గురించి మనమెంత గొప్పలు చెప్పుకున్నా... అమెరికాలోని 99 శాతం పైగా ప్రజలకు తెలుగువారు అనేవారు అమెరికాలో ఉన్నారన్న విషయమే తెలీదు. వాళ్లకు తెలుగువారైనా, గుజరాతీవారైనా, బెంగాలీ వారైనా ఒకటే... అందరూ భారతీయులే. కొంతమందికైతే తెలుపు నలుపు కాని మనబోటి దక్షిణ, మధ్య ఆసియా వారంతా ఒకటే. కాన్సాస్‌లో కాల్పులు జరిపిన ఆడం ప్యూరింటన్ తాను కాల్చింది ఇరానియన్ దేశస్థులను అనుకున్నాడట. తుపాకీలపై ఎటువంటి నియంత్రణా ఉండకూడదు అనేవారు ఎక్కువగా ఉన్న చోట హింసాత్మక సంఘటనలు ఎక్కువగానే ఉంటాయి. గణాంకాల పరంగా చూస్తే, ఇలాంటి ఘర్షణలలో చిక్కుకున్న భారతీయులు, తెలుగువారి సంఖ్య తక్కువే.

ఒక్క విషయం మాత్రం స్పష్టం. గత ఎన్నికలు నిరూపించిన విషయం ఏమిటంటే ఇక్కడ ప్రజలలో చాలామందికి వలస వస్తున్న వారి వల్ల తమ ఉపాధి అవకాశాలు తగ్గిపోతున్నాయన్న కోపం ఉంది. అలాగే ముస్లిం మతస్థుల వల్ల తమ దేశ శాంతి భద్రతలకు భంగం కలుగుతుందన్న అనుమానం, భయం ఉన్నాయి. ఇప్పటివరకూ బయటపడని ఈ అనుమానాలు, కోపాలు, భయాలు ప్రస్తుత అధ్యక్షుడు ట్రంపు ప్రసంగాల వల్ల ఇప్పుడు బహిరంగంగా చర్చించ బడుతున్నాయి. ఈ క్రమంలో విద్వేషచర్యలు పెరుగుతున్న మాట నిజం. ఈ విద్వేషానికి అజ్ఞానం కూడా తోడయితే ఇటువంటి విషాద సంఘటనలు జరిగే అవకాశాలు పెరుగుతాయి. ఈ అజ్ఞానంలో ఉన్నవారికి గోధుమరంగు వర్ణంతో అనేక జాతులు, మతస్థులు ఉన్న విషయం తెలియకపోతే, మనబోటివారికి ప్రమాదస్థాయి పెరుగుతుంది. ఇటువంటి అజ్ఞానపూరితమైన విద్వేషం వల్ల ఇప్పటికే సిక్కు మతస్థులు చాలా ఇబ్బందులకు లోనయ్యారనేది వాస్తవం.

**అమెరికాలో విదేశీ విద్యార్థుల సంఖ్యాపరంగా భారత్ స్థానం 2**

గమనించవలసిన మరో విషయమేమిటంటే ఇటువంటి విద్వేషపరులు ఉన్నా, ఇటువంటి విద్వేషాలు తప్పు అని విశ్వసించేవారు కూడా ఇక్కడ ఎక్కువ సంఖ్యలోనే ఉన్నారు. ఆ రోజు కాన్సాస్ ఘటనలో ఆడంను అడ్డుకుంది, మనవారికి బాసటగా నిలిచింది కూడా తెల్లవారే. నిజానికి అక్కడ విద్వేషపరుడు ఆడం ఒక్కడే. తుపాకీ సంస్కృతి ఎక్కువగా ఉన్న దేశంలో ఏ రంగు వారైనా జాగ్రత్తలు తీసుకోవలసిన అవసరం ఉంది. ఇటువంటి సంఘటనలు ఎక్కడ జరిగినా భారతీయ సంస్థలన్నీ ముక్తకంఠంతో ఖండించడం, ఈ ఘటనలన్నిటినీ విద్వేషపూరిత నేరాలు (హేట్ క్రైమ్స్)గా గణించేలా చేయడం, వివిధ స్థాయిల ప్రభుత్వాలతో కలిసి పనిచేయడం మన కర్తవ్యం. అలాగే అమెరికన్ సమాజానికి మనవల్ల కలుగుతున్న లాభాలని ఇక్కడివారికి విశదీకరించడం, మన పట్ల సదవగాహనను పెంపొందించడం కూడా అవసరం. మనకు మనం గిరిగీసుకుని కూర్చోకుండా, మన చుట్టూ ఉన్న సమాజంలో కలిసిపోయి పాలుపంచుకోవడం మొదలుపెడితే ఇటువంటి దుర్ఘటనలు తగ్గించడానికి వీలవుతుంది.

● **డా. జంపాల చౌదరి,**
'తానా' అధ్యక్షులు



## కొత్తేం కాదు

ఇటువంటి దురాగతాలు ఈ దేశంలో కొత్త కాదు. శ్వేత జాతి అమెరికన్లు ఆఫ్రికన్ అమెరికన్లపై ఈ రకమైన అత్యాచారాలు చేయడం చరిత్ర చదువుకున్న వాళ్లకు తెలియనిది కాదు. అప్పటి హత్యలకు ముఖ్యకారణం రంగు. ఇప్పటి హత్యలకు ముఖ్యకారణం మత విద్వేషం. 2001 సెప్టెంబర్‌లో బిన్ లాడెన్ అనుయాయులు న్యూయార్క్ భవనాలపై దాడి చేసిన తర్వాత సిక్కు మతస్థులనెంతో మందిని ముస్లిం మతస్థులని భ్రమపడి కాల్చి చంపివేశారు.

విచిత్రం ఏమిటంటే ఆ తరుణంలో బిన్ లాడెన్‌ని, అతని అనుయాయులని తెగడటానికి బదులు, పొగుడుతూ అమెరికాపై ద్వేషం కక్కుతూ తెలుగులో కవితలు, వ్యాసాలు ప్రచురితమయ్యాయి. మన దాకా వచ్చినప్పుడే స్పందించడం తప్పు. అటువంటి దాడులు ఎప్పుడైనా ప్రమాదకరమైనవేనని గుర్తు పెట్టుకోవాలి. ప్రస్తుత హత్యల విషయానికొస్తే అమెరికా అధ్యక్షుడు ఈ హత్యలను వెంటనే తీవ్రంగా ఖండించి ఇటువంటివి మరోసారి జరగకుండా వలసదారులకు ప్రత్యేక భద్రత కలగచేస్తానని హామీ ఇవ్వాలి. భారత ప్రభుత్వం కూడా ట్రంప్ ప్రభుత్వం నుంచి వలస వచ్చిన భారతీయులకు తగిన రక్షణ కల్పించేలా హామీ తెచ్చుకోవాలి. అమెరికాలోని భారతీయ సంస్థలు- సెనేటర్లకు, కాంగ్రెస్ మెంబర్లకు, ఇతర అధికారులకు తమ తీవ్ర నిరసన తెలిపే ప్రయత్నాలు చేయాలి.

● **వేలూరి వెంకటేశ్వరరావు,**
రిటైర్డ్ ఫిజిసిస్ట్, షికాగో యూనివర్సిటీ

## జాత్యహంకారం కాదు...





ఇన్ని చరిత్ర పేజీల తర్వాత కూడా
ఇన్ని ఉద్వేగాల సహయానాల తర్వాత కూడా
చివరికి నువ్వో రంగు
నేనో రంగు
అంతే!

రంగు తేడాలూ హత్యలూ అమెరికాలో కొత్త కాకపోవచ్చు కాని, ఇప్పటి వరకూ అవి ఒక విధంగా నల్ల- తెల్ల వైషమ్యాలే! ఇప్పుడు వరసగా భారతీయుల మీద జరుగుతున్న దాడుల్ని బట్టి చూస్తే ఇవి ఇంకా విస్తరించి, గోధుమ (బ్రౌన్)- తెల్ల ఘర్షణలుగా మారే ప్రమాదం వచ్చిందని స్పష్టంగా అర్థమవుతోంది. ట్రంప్ అధికారంలోకి రావడానికి ఉపయోగించుకున్న పరిభాష ఈ తరహా కొత్త వర్ణ అహంకారానికి ఆజ్యం పోసింది.

అస్తవ్యస్తమవుతున్న ఆర్థిక వ్యవస్థ, తెల్లవాళ్లలో పెరుగుతున్న నిరుద్యోగం,

**అమెరికాలో 2015-16లో భారతీయ విద్యార్థుల సంఖ్య 1,65,918**

తగ్గిపోతున్న జీవన ప్రమాణాల మధ్య అమెరికాలో స్థానిక- పరాయి తేడాలు అయిదేళ్లుగా కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలలోనూ, చిన్న పట్టణాల్లోనూ తెల్లవాళ్లకి మొదటి నుంచీ స్థానబలిమి ఉంది. అలాంటి చోట ఇతర రంగుల వాళ్లు మనుగడ సాగించే పరిస్థితి లేదు. ట్రంపిజం ప్రధానంగా అలాంటి తెల్ల ఉనికి నినాదంగా గెలుచుకొచ్చిన రాజకీయ వాదం. ఇందులో తెల్ల పురుష అహంకారమే అసలు విలువ. దీని ముందు మిగిలిన విలువలన్నీ దిగదుడుపయి తెలుపేతర వర్ణాలన్నీ శత్రు వర్ణాలుగా మారాయి.

మొన్నటి వరకూ నల్లవాళ్లూ... నిన్నటి వరకూ కేవలం యూదులు... ముస్లింలు ఈ విధమైన అహంకారానికి బలవుతూ వచ్చారు. ఇవాళ ఈ జాబితాలో భారతీయులు చేరడం ఆశ్చర్యమేమీ కాదు. కాని, నల్లవాళ్ల మీద, యూదులూ, ముస్లింల మీద దాడులు జరుగుతున్నప్పటి మన మౌనానికి ఇవాళ మూల్యం చెల్లించుకోవాల్సి వస్తోంది. ఇంకొక వాస్తవం ఏమిటంటే ట్రంపిజం అనేది కేవలం జాత్యహంకారం కాదు. ఇవాళ ఈ దాడులకు మనం ఒక రంగుని ఆపాదించడం వల్ల మొత్తంగా ఈ విషయం అర్థం కాకుండా పోయే ప్రమాదం ఉంది. అమెరికాలో మారుతున్న ఆర్థిక పరిస్థితుల వల్ల ఏర్పడుతున్న అసమ వ్యవస్థ దీనికి అసలు కారణమని గుర్తించాలి. దీనికి రంగు ఒక సాకు మాత్రమే!

● **అఫ్సర్,** యూనివర్సిటీ ఆఫ్ పెన్సిల్వేనియా, ఫిలడెల్ఫియా



## భారత ప్రభుత్వం ఒత్తిడి పెంచాలి



అమెరికాలో ఇప్పుడు వలసదారులు, ముస్లింలు, యూదుల మీద అసంతృప్తి ఎక్కువగానే ఉన్నప్పటికీ దాన్ని భారత వ్యతిరేకతగా భావించాల్సిన అవసరం లేదు. ఇటీవల జరిగిన దాడుల కారణంగా భారతీయులు యు.ఎస్. ను... నివసించడానికి సురక్షితమైన దేశం కాదని భావించడం కచ్చితంగా ఓవర్ రియాక్షన్ అవుతుంది. 31 కోట్లమంది నివసించే దేశంలో మూడు సంఘటనలను బట్టి... అవన్నీ ఒక పథకం ప్రకారం జరుగుతున్న దాడులని అనుకోవడానికి వీలు లేదు. యూదుల స్కూళ్లు, శ్మశానాలు, ప్రార్థనా మందిరాలు, ముస్లింల మసీదుల మీద కూడా దాడులు జరుగుతున్నాయి. అవేమీ ఇండియాతో సంబంధం ఉన్న దాడులు కావు. అయితే అదే సమయంలో భారత ప్రధాని, ప్రభుత్వం ఈ సంఘటనలను తీవ్రంగా ఖండించి, సత్వర విచారణ జరిపి దోషులను శిక్షించేలా అమెరికన్ ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకురావాల్సిన అవసరం ఉంది.

● **రాజు నరిశెట్టి**
సీనియర్ వైస్ ప్రెసిడెంట్, స్ట్రాటజీ న్యూస్ కార్పొరేషన్



## తలవంపులు తెస్తున్నారు

అమెరికాలో నివసించే ఎన్నారైల పరిస్థితి భారతీయ మీడియాలో ప్రచారం చేసినంత దారుణంగా లేదు. ఒకరిద్దరి ఉన్మాద చర్యలతో మొత్తం అమెరికన్ సమాజమంతా భారతీయులపై విద్వేషంతో రగిలిపోతుందని నిర్ధారించడం తప్పు. వాట్సాప్ వంటి మాధ్యమాల ద్వారా వ్యాపిస్తున్న పుకార్లు భయానికి ఆజ్యం పోస్తున్నాయి. వాటిని పట్టించుకోకుండా ఉంటే మంచిది. అయితే భారతీయులపై పదేళ్ల కిందట సగటు అమెరికన్‌లో ఉన్న అభిప్రాయమే ఇప్పుడూ ఉందా అనేది ఆలోచించాల్సిన విషయం.

నేను ఇరవయ్యేళ్లుగా కాలిఫోర్నియాలో నివసిస్తున్నాను. అమెరికన్ డ్రీమ్ అనేది అందరిలాగే నా తరానికి ఓ అందమైన కల. ఆ కల నిజం చేసుకోడానికి నా తరంలో అధికులు, నా ముందటి తరంలోనైతే అందరూ చాలా కష్టపడ్డామని చెప్పగలను. ఆ క్రమంలో మేము అడ్డదార్లు తొక్కలేదు. మమ్మ ఆదరించి, అవకాశాలు కల్పించిన అమెరికన్ గడ్డని గౌరవిస్తూనే... అదే సమయంలో మేము ముందుగా భారతీయులమన్న విషయాన్నీ గుర్తుంచుకున్నాం. సగటు అమెరికన్‌కి మా ప్రవర్తన, నడవడికలే భారతదేశమంటే ఫలానా అనే ముద్ర వేస్తాయనే స్పృహ కలిగి ఉండి, మాతృదేశానికి మంచి పేరు వచ్చేలా మసలుకునేవాళ్లం. ఎన్నారైలు అన్నీ మంచి విషయాలకే వార్తల్లో ఉండేవారు.

> సగటు అమెరికన్ సంపాదన యేడాదికి 53 వేల డాలర్లయితే, భారతీయుల సంపాదన లక్ష డాలర్లపైనే.

అయితే ఇదంతా పదేళ్ల కిందటి మాట.

ఈ పదేళ్లలో పరిస్థితి మారింది. ఇండియా నుంచి ముఖ్యంగా దక్షిణ భారతం నుంచి ఇబ్బడిముబ్బడిగా విద్యార్థులు అమెరికాలో అడుగుపెట్టడం మొదలయింది. వీళ్లందరూ ఇంజనీరింగ్ పట్టాలతో వచ్చినవారే కాని వీరిలో ఎందరికి తాము చదివిన రంగాల్లో కనీస పరిజ్ఞానం ఉందనేది సందేహాస్పదం. స్టూడెంట్ వీసా తెచ్చుకోవడం సులభతరం కావడంతో... వీళ్లు చాలా తేలికగా అమెరికాలో అడుగుపెడుతున్నారు. కష్టపడకుండా వచ్చిపడడం వల్ల దాని విలువ తెలుసుకోలేకపోతున్నారు. దానికి తోడు ఇండియా నుంచి తమ అలవాట్లన్నీ ఇక్కడికి తెచ్చేస్తున్నారు. ట్రాఫిక్ సెన్స్ లేకుండా చిత్తమొచ్చిన చోట రోడ్లు దాటడం, అభిమాన హీరోల సినిమాలు విడుదలైనప్పుడు థియేటర్ల దగ్గర నానా కంగాళీ చేయడం ఇలాంటివి. ఇక ఉద్యోగాల దగ్గరికొస్తే అత్యధికులు ప్రాక్సీ ఇంటర్వ్యూల ద్వారా దొంగ దారిలో ఉద్యోగాలు సంపాదిస్తున్నారు. ఉద్యోగంలో చేరాక చూస్తే ఆఫీసుల్లో ఇతరుల ఇబ్బంది లెక్కచేయకుండా భారతీయ భాషల్లో బిగ్గరగా ముచ్చటించుకోవడం చేస్తుంటారు. తమ చర్యల ద్వారా భారతీయులపై సగటు అమెరికన్‌లో ఎలాంటి అభిప్రాయం కలగజేస్తున్నామనేది నవతరం ఎన్నారైలు అర్థం చేసుకోవాలి.

● **ఒక ప్రవాస భారతీయుడు**



## ఉద్యోగ లేమే కారణం

ఈ దాడులు ఇమ్మిగ్రెంట్స్ మీద జరుగుతున్న దాడులు. బయట నుంచి వచ్చి తక్కువ జీతాలకు ఉద్యోగాలు చేస్తూ తమకు ఉద్యోగాలు లేకుండా చేస్తున్నారు అనే క్రోధంతో చేస్తున్న దాడులు. ప్రెసిడెంట్ ట్రంప్ వీళ్లని రెచ్చగొట్టిన మాట నిజమే. కాని సమాజంలో లోతుగా ఉన్న భావనను అతను వ్యక్తపరిచాడే గాని, కొత్త అభిప్రాయాన్ని ప్రచారం చేయలేదు. మరో విషయం... సాధారణ అమెరికా పౌరులకు తెలుగు అంటే ఏంటో తెలియదు. చాలా సందర్భాల్లో మెక్సికో వారనో, లేక అరబ్ దేశాల నుంచి వచ్చారనో అనుకుని దాడులు చేశారు. మెక్సికో వాళ్లు తమ ఉద్యోగాలు హరిస్తున్నారనీ, అరబ్ దేశాల నుంచి టెర్రరిస్టులు వస్తున్నారనీ కొందరు అమెరికన్ల అభిప్రాయం.

● **ఆరి సీతారామయ్య,** రచయిత

## నష్టం అమెరికాకే!



అమెరికా వాళ్లకు చెందవలసిన ఉద్యోగాలు పరాయి దేశాల వాళ్లు కాజేస్తున్నారనే ఒక అనాలోచితమైన, అకారణమైన భయం అమెరికాలోని ఒక వర్గంలో వ్యాపించి ఉంది. ఆకారంలో, రంగులో, మాటల్లో వేరే రకంగా ఉంటే నువ్వు అమెరికాలో అక్రమంగా ప్రవేశించి ఉంటావని పోలీసులు కూడా అనుమానించి, ఆపి మరీ పరీక్షించే పరిస్థితులు ఏర్పడ్డాయి.

పిల్లలమర్రి అరవింద విషయంలో జరిగిన సంఘటన ఇందుకు ఒక ఉదాహరణ. బాల్టిమోర్‌లోని బెల్ ఎయిర్‌లో తన ఇంటి ముందు వీధిలో అరవింద నడుస్తుండగా పోలీసులు ఆమెని ఆపి "నువ్వు ఎవరివి? ఇక్కడేం చేస్తున్నావు? నీ గుర్తింపు కాగితాలు చూపించు" అంటూ నిలదీశారు. అరవింద అమెరికా పౌరురాలు. తెలుగమ్మాయి. నేను గతంలో పనిచేసిన విస్కాన్సినే విశ్వవిద్యాలయంలో నా దగ్గర చదువుకుంది కూడా. "చామనఛాయ చర్మంతో రోడ్డు మీద నడవడమే నా తప్పా?" అని పోలీసుల్ని ఎదురు ప్రశ్నించిందామె. అక్కడికి వచ్చిన మరో పోలీసాధికారి తమ తప్పును గ్రహించి తాము మరికొంత వివేచనతో వ్యవహరించి ఉండాల్సిందని ఒప్పుకుని, బెల్ ఎయిర్ నగర పౌరుల ప్రత్యక్ష సమావేశంలో అరవిందని మాట్లాడమని ఆహ్వానించారు. స్థానిక బాల్టిమోర్ సి.బి.ఎస్. టీవీ అరవిందని పిలిచి ఆమె అనుభవాలను అడిగి ప్రసారం చేసింది. కాని కూచిభొట్ల శ్రీనివాస్‌కు ఈ రకమైన పౌరసమాజ రక్షణ లభించలేదు. ఎదురుగా తుపాకీ పట్టుకుని నిలబడ్డ వ్యక్తితో ఎవరికీ మాట్లాడే అవకాశం ఉండదు.

ఇప్పుడు భారతీయులు చేయాల్సింది అమెరికాలోని పౌర సమాజం పట్ల నమ్మకం పెంపొందించుకోవడం. అంతేగాని భయపడి పోయి అమెరికా నుంచి వెళ్లిపోవడం, లేదా అమెరికాకు రాకపోవడం రెండూ చెయ్యదగ్గ పనులు కావు. ద్వేషం వల్ల ముందుగా నష్టపోయేది అమెరికన్ జీవనవిధానమే. అమెరికా ప్రజలే. వారిలో భారతీయులు కొంత భాగమే.

● **ప్రొ. వెల్చేరు నారాయణరావు,**
ఎమరీ యూనివర్సిటీ, అట్లాంటా



Raju





ఈ రోజు బ్యాంక్ క్లోజ్ సార్. లోపల రాబరీ ప్లాన్ చేశాం!
Bank of Local




మీ ఫ్యామిలీని రేపు మా ఆవిడ భోజనానికి పిలిచింది కదా? రావద్దు గురూ... నాకు వంట చేసే ఓపిక లేదు.. ప్లీజ్ !!




మొన్నటి వరకూ తల్లి చెప్పు చేతల్లోనే ఉండేవాడు! నాలుగు లక్షలు పడేస్తే పగ్గాలు నాకు అప్పజెప్పింది మా అత్త !!




నువ్వెన్ని చెప్పు స్వామీ. దేవుడున్నాడంటే చస్తే నమ్మను !!




చీర్స్ గురూ!




ఒకే ఒక్క సినిమాతో ఓవర్‌నైట్‌లో విజయ్ దేవర'కొండ'ంత ఎదిగాడు. గత యేడాది విడుదలైన 'పెళ్లిచూపులు' సినిమాతో ఒక్కసారిగా క్రేజీస్టార్‌గా మారాడు. ప్రస్తుతం అతడి చేతిలో అరడజనుకుపైగా సినిమాలున్నాయి. 'ద్వారక' ఇటీవలే విడుదలైంది. 'అర్జున్‌రెడ్డి' విడుదలకు సిద్ధమవుతోంది. 'షికారు' షూటింగ్ జరుగుతోంది. విజయ్ దేవరకొండ డేట్స్ కోసం పెద్ద పెద్ద సంస్థలు క్యూలు కడుతున్నాయి. ఈ క్రేజ్ ఓవర్‌నైట్‌లో వచ్చినప్పటికీ, దాని వెనుక విజయ్ కృషి సినిమాపై అతడికున్న ఇష్టాన్ని తెలుపుతుంది. 'నా తండ్రి నటుడు కావాలనుకున్నాడు. కానీ కాలేకపోయాడు. వేరే దారి లేక సినిమారంగంలోకి వచ్చిన నేను మాత్రం స్టార్‌నయ్యాను. అదే విధి విచిత్రం' అంటున్న మోస్ట్ హ్యాండ్సమ్ హీరో విజయ్ దేవరకొండ చెబుతున్న ఆసక్తికర విశేషాలివి...

# నాన్న కోసం నటనవైపు అడుగులు...

**డి**గ్రీ అయిపోయేదాకా సినిమాల్లోకి రావాలనే కోరికగానీ, ఆసక్తిగానీ నాకుండేవి కావు. బీకామ్ అయిపోయిన తర్వాత ఏ ఎంబీయేనో, మరేదో ప్రొఫెషనల్ కోర్సో చేసి ఈపాటికి ఏ కంపెనీలోనో ఉద్యోగం చేస్తుండేవాడిని. నా జీవితం సినిమాలవైపు మలుపు తిరగడానికి కచ్చితంగా మా నాన్నే కారణం. అది కూడా నాకు మరో మార్గం లేని పరిస్థితుల్లో, తాడో పేడో తేల్చుకోవడానికి సినిమారంగం వైపు అడుగులు వేయాల్సి వచ్చింది. నా గురించి తెలుసుకోవాలంటే ముందు మా నాన్న 'సినిమాపిచ్చి' గురించి చెప్పాలి.

మాది అచ్చంపేట్ (గతంలో మహబూబ్‌నగర్ జిల్లా ప్రస్తుతం నాగర్‌కర్నూల్ జిల్లా) దగ్గరున్న తుమ్మన్‌పేట్ అనే చిన్న పల్లెటూరు. మా నాన్న పేరు గోవర్ధన్‌రావు. ఊళ్లో మాకు పొలాలుండేవి. మా నాన్న ఒడ్డూపొడుగు చూసి 'హీరోల ఉన్నావు సినిమాల్లో ట్రై చేయమ'ని ఊళ్లో వాళ్లంతా అనేవారట. దాంతో మా నాన్న నా చిన్నప్పుడే హైదరాబాద్‌కు షిఫ్ట్ అయ్యారు. మధు ఫిల్మ్ ఇనిస్టిట్యూట్‌లో శిక్షణ పొంది ఆ తర్వాత సినిమా అవకాశాల కోసం ప్రయత్నించి చివరికి టీవీ డైరెక్టర్‌గా సెటిలయ్యారు. అప్పట్లో దూరదర్శన్, జెమినీ టీవీలకు పనిచేసేవారు. ప్రభుత్వ ప్రకటనలు కూడా రూపొందించేవారు. మా అమ్మకు నన్ను, మా తమ్ముడిని బాగా చదివించాలని కోరిక ఉండేది. అప్పటికే మా పెద్దమ్మ వాళ్ల పిల్లలు పుట్టపర్తిలోని సత్యసాయి స్కూలులో చదివారు. దాంతో నన్ను కూడా అక్కడే చేర్పించారు.

### ఆదివారం సినిమా... అదో సరదా...

క్రమశిక్షణకు మారుపేరు పుట్టపర్తి సత్యసాయి స్కూలు. ప్రశాంతమైన, పరిశుభ్రమైన వాతావరణంలో ఎలాంటి డిస్టర్బెన్స్ లేకుండా చదువు సాగేది. అక్కడ పెద్ద లైబ్రరీ ఉండేది. ఆ లైబ్రరీలో కామిక్ బుక్స్, కథల పుస్తకాలు బాగా చదివేవాణ్ణి.

> 'పెళ్లిచూపులు' సినిమాకు పనిచేసిన టెక్నీషియన్లంతా దాదాపుగా నా ఏజ్‌గ్రూప్ (25-27) వారే. మేమంతా స్క్రిప్టును మాత్రమే నమ్మాం కాబట్టి కాన్ఫిడెంట్‌గా, కసిగా పనిచేశాం. నిర్మాతలు కూడా పూర్తి నమ్మకంతో ప్రాజెక్టును మాకు వదిలేశారు కాబట్టే ఆ సినిమాలో 'ఫ్రెష్‌నెస్' కనిపిస్తుంది.

అక్కడే నాకు స్టోరీ టెల్లింగ్ మీద పట్టు ఏర్పడింది. నేను చదివిన కథలను రాత్రిపూట నా ఫ్రెండ్స్‌కు అద్భుతంగా నెరేట్ చేసేవాణ్ణి. వాళ్లంతా మెస్మరైజ్ అయినట్లుగా వినేవారు. నాలుగో తరగతిలో ఉండగానే 'మై బెస్ట్ ఫ్రెండ్ ఎ మంకీ' అనే పుస్తకం రాస్తానని చెబితే టీచర్లు, ఇంట్లోవాళ్లు నవ్వి ఊరుకున్నారు. స్కూల్‌లో టీవీ కూడా ఉండేది కాదు. కానీ ప్రతీ ఆదివారం మా కోసం 'బేబీస్ డే అవుట్' లాంటి బాలల చిత్రాలను పెద్ద స్క్రీన్‌పై ప్రదర్శించేవారు. వాటిని చూడటం సరదాగా ఉండేది. అంతకుమించి సినిమాల గురించి పెద్దగా ఆసక్తి ఉండేది కాదు. నిజానికి టెన్త్ తర్వాత ఇంటర్ కూడా అక్కడే చదవాలి. కానీ నేను అనుకున్న గ్రూపులో సీటు రాలేదు. దాంతో నేను హైదరాబాద్‌కు తిరిగొచ్చాను. ఉప్పల్‌లోని 'లిటిల్ ఫ్లవర్ కాలేజీ'లో ఇంటర్ చదివి, ఆ తర్వాత కాచిగూడలోని బద్రుకా కాలేజీలో బీకామ్ డిగ్రీలో చేరాను.

### నాటకం వైపు అడుగులు...

హైదరాబాద్ శివారుల్లోని సరూర్‌నగర్ నుంచి కాచిగూడలో ఉన్న కాలేజీకి రోజూ సిటీబస్సులో రావడమంటే పగటిపూటే చుక్కలు కనిపించేవి. పైగా నాకు బస్సు పడేది

కాదు. దాంతో ఒకరోజు కాలేజీకి వెళితే మూడు నాలుగు రోజులు డుమ్మా కొట్టేవాడిని. రోజంతా ఇంట్లోనే కూర్చుని టీవీలో వచ్చే సినిమాలు చూస్తుంటే నా తీరు చూసి మా నాన్న విసుగెత్తిపోయాడు. ఖాళీగా ఎందుకుంటావ్? అంటూ పోరుపెట్టేవాడు. ఆ పోరు పడలేక, ఆయన బలవంతం మీదనే హిమాయత్‌నగర్‌లో ఉన్న వినయ్‌వర్మగారి 'సూత్రధార్' యాక్టింగ్ స్కూలులో చేరాను. చిన్నప్పటి నుంచే బెరుకు, భయం అంటే ఏమిటో తెలియవు కాబట్టి అక్కడ యాక్ట్ చేయడానికి పెద్దగా ఇబ్బంది పడేవాడిని కాదు. ఎక్కువగా 'షెర్లాక్ హోమ్స్' వంటి ఇంగ్లీషు నాటకాలు వేసేవాళ్లం. బిర్లా సైన్సు మ్యూజియం ఆవరణలోని భాస్కర్ ఆడిటోరియంలో ఎన్నో నాటకాలు వేశాం. అక్కడ ఒక థియేటర్ వారు నాటకం వేస్తుంటే మరో థియేటర్ వాళ్లు చూస్తుండేవాళ్లు. అలా స్టేజీ మీద నా నటన చూసి మిగతా థియేటర్ల నుంచి కూడా నాకు ఆఫర్లు వస్తుండేవి.

మూడేళ్లు గడిచేసరికి (డిగ్రీ 2010లో పూర్తయ్యింది) 'ఎన్నాళ్లు నాటకాలంటూ తిరుగుతావు... సినిమాల్లో ప్రయత్నించు' అంటూ మా నాన్న కొత్త పల్లవి అందుకున్నాడు. అదే సమయంలో శేఖర్‌కమ్ములగారి యాడ్ చూశాను. ఆయనకు నా ప్రొఫైల్ ఈమెయిల్ చేస్తే ఆడిషన్ చేసి 'లైఫ్ ఈజ్ బ్యూటీఫుల్'లో చిన్న పాత్రకు ఎంపికచేశారు. ఆ సినిమా తర్వాత అవకాశాల కోసం ఎదురుచూడక తప్పలేదు. ఎలాగూ సినిమాల్లోకి ప్రవేశించాను కాబట్టి నాకు 25 ఏళ్ల వయసు వచ్చేంత వరకే సినిమా ప్రయత్నాలు చేసి ఒకవేళ అవకాశాలు రాకుంటే ఎంబీఏ చదివి ఏదో ఒక ఉద్యోగంలో స్థిరపడిపోదామని గట్టిగా ఒక నిర్ణయం తీసుకున్నా.






- ఫేస్‌బుక్‌లో యాక్టివ్‌గా ఉంటా.
- ఫ్లాప్ అయినా 'ఖలేజా' సినిమా బాగా నచ్చింది.
- వాలీబాల్, క్రికెట్, బ్యాడ్మింటన్ బాగా ఆడుతా.
- ప్రతీ యేడాది ఫ్రెండ్స్‌తో ఒక హాలీడే ట్రిప్ తప్పనిసరి.
- ఎంత బిజీగా ఉన్నా వీకెండ్స్‌లో ఫ్రెండ్స్‌తో గడపడం ఇష్టం.
- మా నాన్నగారి ఊరికి దగ్గర్లో ఉన్న చిన్న పల్లెటూరు 'రాకొండ' మా అమ్మగారి ఊరు. సెలవులు వస్తే చాలు కుటుంబంతో అక్కడికి వెళ్లడం సరదాగా ఉండేది.

### 'ఎవడే సుబ్రమణ్యం'తో గుర్తింపు...

'లైఫ్ ఈజ్ బ్యూటీఫుల్' సినిమాకు శేఖర్ కమ్ముల గారి దగ్గర నాగ్ అశ్విన్ అసిస్టెంట్‌గా పనిచేశాడు. షూటింగ్ సమయంలో నన్ను బాగా గమనించిన అశ్విన్ తను తీసిన ఒక కాలేజీ యాడ్‌లో అవకాశం ఇచ్చాడు. అతడికి డైరెక్టర్‌గా 'ఎవడే సుబ్రమణ్యం'లో ఛాన్స్ వచ్చిన తర్వాత అందులోని రిషి క్యారెక్టర్‌కు కొందరి పేర్లు అనుకుని చివరకు నన్ను ఎంపిక చేశారు. బయట నేను ఎలా ఉంటానో దాదాపుగా అలాంటి పాత్రే కావడంతో రెచ్చిపోయి చేశాను. 'రిషి' పాత్రలో నా ఎనర్జీ అందర్నీ ఆకట్టుకుని నాకో గుర్తింపు తీసుకొచ్చింది. ఆ సినిమా విడుదలైన నాలుగు నెలల తర్వాత తరుణ్ భాస్కర్ 'పెళ్లిచూపులు' స్క్రిప్టుతో నా దగ్గరకు వచ్చాడు. స్క్రిప్టు వినగానే రెగ్యులర్ ఫార్మాట్‌లో లేదు, డిఫరెంట్‌గా ఉందని అర్థమయ్యింది. మేమిద్దరం కలిసి నిర్మాతను వెతికే పనిలో పడ్డాం. చాలామందిని కలిసి స్క్రిప్టు వినిపించాం. 60 లక్షల్లో తీస్తానని అశ్విన్, 80 లక్షల్లో తీస్తామని నేను చెప్పేవాణ్ణి. కానీ మా మాటల్ని అంత తొందరగా ఎవరూ నమ్మలేదు. చివరికి సుధాకర్ అనే ఫ్రెండ్ (లైఫ్ ఈజ్ బ్యూటీఫుల్‌లో నాగరాజు) ద్వారా నిర్మాత రాజ్ కందుకూరిని కలిసి మా స్క్రిప్టు వినిపించాం. ఆయనకు నచ్చడంతో పాటు లండన్‌లోని మా మావయ్య కూడా ప్రాజెక్టుపై నమ్మకంతో కొంత పెట్టుబడి పెడతాననడంతో సినిమా పట్టాలెక్కింది. ఆడియో రిలీజ్‌కు వచ్చిన సురేష్‌బాబుగారు పాటలు విని తను కూడా సినిమాలో భాగస్వామిని అవుతానన్నారు. దాంతో 'పెళ్లిచూపులు' సినిమాకు ఒక క్రేజ్ ఏర్పడింది. కోటి రూపాయలు పెడితే కోటిన్నర వస్తుందని మాకు ముందు నుంచి నమ్మకం ఉండేది.

### 'పెళ్లిచూపులు' ఓ మిరాకిల్...

'పెళ్లిచూపులు' సినిమా విడుదల సమయానికి నేను 'అర్జున్‌రెడ్డి' సినిమా షూటింగ్ కోసం ఇటలీలో ఉన్నాను. నిజానికి 'ఎవడే సుబ్రమణ్యం' విడుదలైన తర్వాత నేను రెండు చిన్న సినిమాలకు సైన్ చేశాను. అవి 'ద్వారక', 'అర్జున్‌రెడ్డి'. షూటింగ్‌లో ఉండగానే 'పెళ్లిచూపులు' ట్రెండ్ సృష్టించిందని 'కంగ్రాట్స్' చెబుతూ నా మెయిల్‌బాక్స్ నిండిపోయింది. దర్శకుడు తరుణ్ భాస్కర్‌కు నాకు కూడా ఆ సినిమా తప్పకుండా ఆడుతుందని నమ్మకం ఉండేది కానీ 30 కోట్లు వసూలు చేస్తుందని మేము ఊహించలేదు. ఆ సినిమాతో ఓవర్‌నైట్‌లో నాకు క్రేజ్ వచ్చేసింది. అందరూ పక్కింటి అబ్బాయిలా ఉన్నానని నన్ను అభిమానించడం మొదలెట్టారు. ఒక 'చిత్రం', ఒక 'హ్యాపీడేస్'లాగా పదేళ్లకోసారి ఇండస్ట్రీలో మిరాకిల్ జరుగుతుందంటారు కదా... అలాంటి ఓ మిరాకిల్ 'పెళ్లిచూపులు'.

స్టోరీ టెల్లింగ్‌లో నాకు ప్రావీణ్యం ఉన్నట్టే, స్టోరీ పికప్ చేయడంలో కూడా నాకంటూ ఒక టేస్ట్ ఉంది. ఆ టేస్ట్ ప్రకారమే సినిమా కథలు ఎంపికచేసుకుంటున్నా. నా సినిమాలకు పనిచేస్తున్న దర్శకులు కూడా కొత్తవాళ్లే కాబట్టి మేమంతా టీమ్‌వర్క్‌లాగా సినిమా మేకింగ్‌ను ఎంజాయ్ చేస్తున్నాం. అక్కడే సగం విజయం దాగుంది. ప్రస్తుతం నా పొజిషన్‌ను నా కన్నా మా నాన్న బాగా ఎంజాయ్ చేస్తున్నారు. ఎందుకంటే ఆయన కల నేను నెరవేర్చాను కదా.

**● చల్లా శ్రీనివాస్**

"శ్రీనివాస్... ఏంటి ఇంకా కొరియా కంపెనీ నుంచి డబ్బు రాలేదా?"

" ఇంకా రాలేదు సార్..."

" అదేంటీ... కన్‌సైన్‌మెంట్ డెలివర్లై దాదాపుగా నెల దాటిపోయింది కదా..." కాస్త విసుగ్గానే అన్నాడు ఎండీ సుధాకర్.

" బ్యాంక్ స్టేట్‌మెంట్ చూశాను సార్... మామూలుగా వాళ్ల సరుకు అందిన రెండు వారాల్లో డబ్బు పంపిస్తారు. ఈసారి ఎందుకో ఆలస్యమైంది..."

" అర్జెంట్‌గా ఒక మెయిల్ పెట్టు..."

" ఓకే సార్...' అంటూ సిస్టమ్ ఆన్ చేశాడు శ్రీనివాస్.

# cyber క్రైమ్

# 3.5 కోట్లు... హాంఫట్...

సరుకు పంపించి నెలరోజులు దాటిందని, తమకు రావాల్సిన మూడున్నర కోట్ల రూపాయలు ఇంకా అందలేదని, త్వరగా డబ్బు ట్రాన్స్‌ఫర్ చేయాలని వెంటనే కొరియా కంపెనీకి మెయిల్ పెట్టాడు.

కొద్దిసేపటికే కొరియా కంపెనీ నుంచి రిప్లై వచ్చింది. ఆ మెయిల్ చూసి కంగు తిన్నాడు శ్రీనివాస్. మీ సరుకు అందిన వెంటనే ఎప్పటిలాగే 3.5 కోట్ల రూపాయలను మీ బ్యాంకు ఖాతాకు ట్రాన్స్‌ఫర్ చేశామని ఆ మెయిల్‌లో ఉంది. అంతేగాక ట్రాన్సాక్షన్ రిఫరెన్స్ నెంబర్ కూడా ఇచ్చారు వాళ్లు.

'డబ్బు అందకపోగా... తమ ఖాతాకు ట్రాన్స్‌ఫర్ చేశామంటూ ట్రాన్సాక్షన్ నెంబర్ వచ్చిందేమిటా' అనుకుంటూ బ్యాంక్ స్టేట్‌మెంట్ కాపీని ఒకటికి రెండుసార్లు జాగ్రత్తగా పరిశీలించాడు శ్రీనివాస్. ఎక్కడ కూడా ఆ బ్యాంక్ ట్రాన్సాక్షన్ నెంబర్‌కు మ్యాచ్ అవుతూ 3.5 కోట్ల రూపాయలు తమ ఖాతాలో పడినట్లులేదు.

కొరియా కంపెనీ నుంచి వచ్చిన మెయిల్ తీసుకుని ఎండీ ఛాంబర్‌లోకి వెళ్లాడు.

మెయిల్ చూడగానే సుధాకర్ ముఖంలో రంగులు మారాయి.

"అదేంటీ... వాళ్ల ప్రతీసారి మనకు పంపించే అకౌంట్ నెంబర్‌తో కాకుండా మరో అకౌంట్ నెంబర్‌కు డబ్బు ఎందుకు పంపారు..."

" అవున్సార్... అదే నాకు అర్థం కాలేదు. అసలు ఆ అకౌంట్ నెంబర్‌తో మన ఫర్మ్ ఖాతా ఎక్కడా లేదు కూడా..."

" ఎక్కడో ఏదో జరిగింది. వాళ్లతో డైరెక్ట్‌గా మాట్లాడదాం..." అంటూ కొరియా కంపెనీ పెద్దలకు ఫోన్ కలిపాడు.

ఫోన్‌లో వారు చెప్పిన విషయాలు విని సుధాకర్‌కు చెమటలు పట్టాయి.

"శ్రీనివాస్... మనం మోసపోయాం. మనల్ని ఎవరో నిండా ముంచేశారు. అర్జెంట్‌గా పోలీసులకు ఫిర్యాదు చేయాలి" అంటూ హడావిడిగా సుధాకర్ సైబర్ క్రైమ్ పోలీస్‌స్టేషన్‌కు బయలుదేరాడు.

• • •

"సార్... మా కంపెనీకి రావాల్సిన మూడున్నర కోట్ల రూపాయలు ఎవరి ఖాతాలోకో వెళ్లాయి. మా కంపెనీ పేరిట వాళ్లు ఖాతా తెరిచి, మా క్లయింట్‌ను మోసం చేసి డబ్బు గుంజారు..." ఆందోళనగా ఫిర్యాదు చేశాడు సుధాకర్.

కేసు వివరాలు నోట్ చేసుకున్న ఇన్‌స్పెక్టర్ రాజు " సాధారణంగా మీరు కొరియా కంపెనీతో సంప్రదింపులు ఎలా జరుపుతారు" అని ప్రశ్నించాడు.

మా కంపెనీకి ఒక మెయిల్ ఐడీ ఉంది. దాని పాస్‌వర్డ్ నాతో పాటు మా ఉద్యోగి శ్రీనివాస్‌కు మాత్రమే తెలుసు. మేమిద్దరం మాత్రమే కంపెనీ మెయిల్ ఐడీ ద్వారా సంప్రదింపులు చేస్తుంటాం. మాకు తెలియకుండా మా కంపెనీ మెయిల్ ఐడీ ద్వారా కొరియా కంపెనీకి ఒక ఈమెయిల్ వెళ్లింది. అందులో మేము బ్యాంకు ఖాతా నెంబర్ మార్చుకున్నామని, తదుపరి పేమెంట్స్ ఆ ఖాతాలో వేయాలని ఉంది. దాంతో కొరియా కంపెనీ వాళ్లు ఆ ఖాతా నెంబర్‌కు డబ్బు ట్రాన్స్‌ఫర్ చేశారు. అయితే ఆ మెయిల్ పంపింది మాత్రం మేము కాదు" అన్నాడు సుధాకర్ అయోమయంగా.




"అంటే మీ మెయిల్ హ్యాకింగ్ జరిగిందన్నమాట. ఒకసారి మీ కంప్యూటర్ ఐపీ నెంబర్ ఇవ్వండి" అనగానే ఆ వివరాలను ఇన్‌స్పెక్టర్‌కు అందించాడు శ్రీనివాస్.

దానితో కంప్యూటర్‌పై సెర్చ్ చేసి కాసేపటికి మోసం జరిగిన విధానాన్ని గుర్తించారు పోలీసులు.

"సుధాకర్ గారు... మీ మెయిల్ ఐడీ, పాస్‌వర్డ్ అన్‌సెక్యూర్డ్‌గా ఉన్నాయి. సాధారణంగా సైబర్ నేరగాళ్ల ఇలాంటి మెయిల్స్ మీద వల విసురుతారు. ముఖ్యంగా వ్యాపార లావాదేవీలు జరిపే వారి మెయిల్స్ హ్యాక్ చేస్తారు. వాటి లావాదేవీలను కొంతకాలం పరిశీలించి, అదును చూసుకుని నగదు చెల్లించాల్సిన వ్యక్తికి మీరు పంపినట్టుగా మెయిల్ పంపిస్తారు. బ్యాంక్ ఖాతా మారిందంటూ తమ ఖాతాను ఇస్తారు. దాంతో చెల్లింపులు సైబర్ నేరగాడి ఖాతాలో పడతాయి"

" అయితే ఆ డబ్బు ఏ ఖాతాలో పడిందో తెలుస్తుంది కదా..." అడిగాడు సుధాకర్.

" తెలుస్తుంది. కానీ మీ డబ్బు ఎక్కడికి వెళ్లిందో తెలుసా... బల్గేరియాలోని బ్యాంకు ఖాతాకు. సైబర్ నేరగాడు కాంబోడియా నుంచి ఆపరేషన్ నిర్వహించాడు. బల్గేరియా ఖాతా నుంచి ఆ డబ్బు మళ్లీ కాంబోడియాకు చేరింది. అంటే హ్యాకర్ చేతిలోకి ఆ డబ్బు చేరింది. ఇప్పుడు మనం చేసేదేమీ లేదు..."

" బ్యాంకు వాళ్లను సంప్రదించి నేరస్తుడి వివరాలు సేకరించొచ్చు కదా..."

"సాధారణంగా హ్యాకర్లు బ్యాంకు ఖాతాలు ప్రారంభించడానికి ఇచ్చిన వివరాలన్నీ బోగస్‌వే ఉంటాయి. విదేశాలతో లావాదేవీలు జరిపే వాళ్లనే వీరు టార్గెట్ చేస్తుంటారు. దీన్నే అకౌంట్ టేకోవర్ అంటారు. గతంలో ఇలాగే ఇండియన్ టొబాకో ట్రేడర్స్‌ను మోసం చేసి 2.35 కోట్ల రూపాయలు కాజేశారు..."

" అలాగైతే ఇప్పుడు మా పరిస్థితి ఏంటి..."

" సైబర్ నేరగాళ్ల ఇలాంటి మోసాలను విదేశాల నుంచి ఆపరేట్ చేస్తున్నారు కాబట్టి వారిని పట్టుకోవడం కష్టమే..." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఆన్‌లైన్ మోసానికి 3.5 కోట్ల రూపాయలు కోల్పోయానని గుర్తించి కుప్పకూలిపోయాడు సుధాకర్.

● **వేములు సత్యనారాయణ,**
**99854 88800**

దైవమ్

# నా ఫలసిద్ధి వినాయకుడు

- జయప్రద



పరిచయం అక్కర్లేని నటి జయప్రద. ఇప్పటికీ రంగు గురించి ప్రస్తావించాల్సిన పలు సందర్భాల్లో 'జయప్రద రంగు' అనడం పరిపాటి. నటిగా కొన్ని వందల పాత్రలతో మెప్పించిన ఆమె, ఎంపీగానూ పలు సేవలందించారు. ఏ రంగంలో ఎంత బిజీగా ఉన్నా దేవుడికి, భక్తికి ఆమె చాలా ప్రాధాన్యమిస్తారు. భక్తి ప్రస్తావన వచ్చినప్పుడు ఆ విషయాన్నే ప్రస్తావిస్తూ 'ప్రతి ఏడాది గణపతి నవరాత్రుల సమయంలో ముంబైలో వాలిపోతాను' అని చెప్పారు జయప్రద. ముంబై సిద్ధివినాయక కోవెలతో ఆమెకున్న అనుబంధాన్ని పంచుకున్నారు.

"నాకు బాల్యం నుంచే దేవుడంటే భయభక్తులు ఉండేవి. అందుకు కారణం మా అమ్మ నీలవేణి. నిద్రలేచినప్పటి నుంచి ఆమె దైవస్మరణ చేసేది. నాకు, మా అక్కకు కూడా అదే అలవాటైంది. చిన్నప్పుడు అమ్మ ఎలా చెబితే అలాగే దణ్ణం పెట్టుకునేవాళ్లం కూడా. నేను హీరోయిన్ అయ్యాక ఒకసారి షూటింగ్ కోసం బొంబాయి వెళ్లా. (ఇప్పుడు ముంబై అయింది కానీ అప్పుడు బొంబాయి అనే అనేవాళ్లం). షూటింగ్‌లో గ్యాప్ దొరకడంతో సిద్ధివినాయక కోవెలకు వెళ్లా. గర్భగుడిలో విఘ్నేశ్వరుడిని చూడగానే చాలా ప్రశాంతంగా, కళగా అనిపించింది. అప్పటి నుంచి ఎప్పుడు ముంబై వెళ్లినా ఆ గుడికి తప్పక వెళ్లేదాన్ని. అదే తర్వాత అలవాటుగా మారిపోయింది. ఏ పని ప్రారంభించినా ముందుగా సిద్ధివినాయకుడిని దర్శనం చేసుకోవడం మొదలుపెట్టాను.

ఇప్పటికీ గణేశ్ నవరాత్రుల సందర్భంగా నిష్ఠగా పూజలు చేస్తాను. ఉపవాసాలు ఉంటాను. ముంబైలో నేను నివాసం ఉంటున్న జుహూ నుంచి సిద్ధి వినాయక టెంపుల్‌కి ఏడాదికి ఒక్కసారైనా నడిచి వెళ్తాను. తెల్లవారుజామున నాలుగు గంటలకు లేచి నడవటం మొదలుపెడతా. ఎంపీగా ఉన్నప్పుడు కూడా అంతే. తలమీద ఓ క్యాప్ పెట్టుకుని చుడిదార్ వేసుకుని తలదించుకుని నడుచుకుంటూ వెళ్తే ఎవరూ పెద్దగా గుర్తుపట్టేవారు కాదు. దూరంగా నా సెక్యూరిటీ వెహికల్ వచ్చేది. ఒకవేళ దారిలో ఎవరైనా గుర్తుపట్టినా దగ్గరికి వచ్చి షేక్ హ్యాండ్ ఇచ్చి వెళ్లిపోయేవారు. నేనే కాదు చాలామంది సిద్ధి వినాయకుడి కోవెలకు కాలి నడకన నడిచి వెళ్తుంటారు. అలాంటి వారి కోసం అప్పుడప్పుడూ నీళ్ల ప్యాకెట్లు కూడా పంపించేదాన్ని. కుడివైపుకు తిరిగిన తొండంతో చతుర్భుజాలతో కొలువైన ఆ వినాయకస్వామిని చూస్తుంటే సమయం తెలియదు. మా అమ్మ కుడుములు, ఉండ్రాళ్లు చాలా బాగా చేసేవారు. ఈ గుడిలో స్వామి వారికి ఒక చేతిలో కుడుములు కనిపిస్తాయి. అందుకే గణేశుడిని చూసిన చూసిన ప్రతిసారీ నాకు మా అమ్మ చటుక్కున గుర్తుకొస్తుంది."

● డా. చల్లా భాగ్యలక్ష్మి

కొత్తగా

# 'లైట్..' వేస్కో బ్రదర్...

**'దీపం** ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోమనేది...' పాత సామెత. ఆ సామెత ఉద్దేశం ఏమైనా కాని కిరోసిన్ బుడ్డిలో ఒత్తిని పెట్టి వెలిగించే ఆనాటి దీపాలు ఇప్పుడు దాదాపుగా కనిపించడం లేదు... వాటి స్థానంలో ట్యూబ్‌లైట్లు, ఎల్ఇడి లైట్లే కాదు... ఎనెన్నో రకాల విద్యుత్ దీపాలు వచ్చాయి. వస్తూనే ఉన్నాయి. అయితే కొన్ని వెరైటీ బల్బులతో ఇంటి లుక్‌ను పూర్తిగా మార్చేసే ప్రయత్నాలు ఈ మధ్యన ఎక్కువయ్యాయి. బల్బులంటే.. ఇలాగే ఉండాలా? మరోలా ఎందుకు ఉండకూడదు? అని ప్రశ్నిస్తూ... విభిన్నమైన రూపాల్లో... వినూత్నంగా... అనేక టేబుల్ లైట్లను రూపొందిస్తున్నారు తయారీదారులు. చూసిన వెంటనే అది బల్బో... లేక అలంకరణ వస్తువో అర్థం కానట్టుగా డిజైన్ చేసి మేకింగ్‌లో మ్యాజిక్‌ను కూడా మిక్స్ చేసి చూపిస్తున్నారు. వరుసగా పేర్చిన గులకరాళ్ల మీద సూర్యుడు వెలుగుతున్నట్టుగా... ఎండిన చెట్టుకాడలతో కాగడా వెలిగించినట్టుగా... బోర్లించిన కాఫీ కప్పుల పైన కలర్‌ఫుల్ దీపాలు అమర్చినట్టుగా... ఆ ఇంటివాళ్లు చెబితే గాని అది 'టేబుల్ ల్యాంప్' అని తెలుసుకోలేని విధంగా ఉన్నాయి వీటి డిజైన్లు. వీటితో ఎటువంటి లొకేషన్‌కైనా కొత్త అందం తీసుకురావడం ఖాయం.

# చెవిసొంపుగా...

**వేసుకునే** డ్రెస్సుకు... హెయిర్ స్టైల్‌కు... సెట్ అయ్యే విధంగా మ్యాచింగ్ కమ్మలు (పోగులు, దుద్దులు) కోరుకుంటారు చాలామంది అమ్మాయిలు. అలాంటి వారికి కొత్త లుక్కును అందించేందుకు అనేక రకాల వెరైటీ కమ్మలు మార్కెట్లో అందుబాటులోకి వచ్చాయి. ఒకప్పుడు చెవికమ్మలు అంటే పూలు, బుట్టలు, లోలాకులు వంటి సంప్రదాయ డిజైన్లు మాత్రమే ఉండేవి. యువతను ఆకట్టుకోవడమే లక్ష్యంగా ఇప్పుడు ఎన్నో రకాల కొత్త కొత్త డిజైన్లు రూపొందిస్తున్నారు తయారీదారులు. ఒకప్పుడు చెవి తమ్మికి మాత్రమే పరిమితమై ఉండిన కమ్మలు... ఇప్పుడు చెవి మొత్తం నిండిపోతున్నాయి. గొలుసులను తెంచుకుని ఎగిరిపోవాలనుకునే పక్షులు... స్వేచ్ఛగా రాలిపడుతున్న ఆకులు... కొమ్మలు... అందమైన రంగురంగుల పువ్వులు... చెవిని ఆలింగనం చేసుకున్నట్టుండే డ్రాగన్ లాంటి జంతువులు... మిణుగురును అందుకోవాలని ప్రయత్నించే బల్లి... కోడి ఈకలు... ఏదో పెద్ద గోడను ఎక్కుతున్నట్టుగా చెవి అంచులను పట్టుకుని పైకెక్కుతున్న మనుషులు.. ఇలా ఎన్నో విభిన్నమైన డిజైన్లు యువతుల చెవులను అలంకరిస్తున్నాయి. డిఫరెంట్ లుక్‌ను కోరుకునే అమ్మాయిలకు ఛాయిసే ఛాయిస్.

# లవ్లీ లంచ్‌బాక్సులు

**పిల్లలకు** లంచ్, స్నాక్స్ బాక్సులు పెట్టేటప్పుడు అందులో వాళ్లకు ఇష్టమైనవి పెట్టడానికి తల్లులు ఎంత తాపత్రయపడతారో... చూడముచ్చటైన డిజైన్లతో పిల్లలను ఆకట్టుకునేందుకు అంతే తాపత్రయపడుతున్నారు లంచ్ బాక్సుల ఉత్పత్తిదారులు. ఫలితమే ఇదిగో ఇక్కడ కనువిందు చేస్తోన్న లవ్లీ లంచ్ బాక్సులు. కార్టూను క్యారెక్టర్ ఒక బాక్సులా ముస్తాబయితే మరొకటేమో బిస్కెట్ సోయగాన్ని అద్దెకు తెచ్చుకుంది. రెట్రో స్టైల్‌కు ట్రేడ్‌మార్క్ నేనే అన్నట్టు అలనాటి టీవీ లంచ్‌బ్యాగ్ రూపంలో ఎలా హొయలు పోతోందో చూడండి. తామేం తక్కువ కాదన్నట్టు బర్గర్‌కి బ్రదర్స్‌లా పోజులు కొడుతున్నాయి మరో రెండు లంచ్ బాక్సులు. పైనాపిల్, ఫుట్‌బాల్ ఇలా ఎన్నో డిజైన్లు తెరిచి తినడానికి ముందే కనువిందు చేస్తున్నాయి. లంచ్‌బాక్సులే కాదు వాటి కవర్లు కూడా మనసుకు గాలం వేస్తున్నాయి.





## ఛాయా'చిత్రమ్'




ఐ డోంట్ వాంట్ దిస్ బ్లడీ కేక్
ఐ వాంట్ ఒరిజనల్ బోన్ పీస్!

## • అంతా మనమంచికే!

ఒకే ఒక అక్షర దోషం వల్ల రెండ్రోజుల్లో రెండు మిలియన్ల బుక్స్ అమ్ముడయ్యాయట. ఆ బుక్ పేరేంటో తెలుసా?

'ఒక ఐడియా మీ 'వై'ఫ్‌ను మార్చగలదు!'

## హెచ్చరికో ... హెచ్చరికో!



మా డాడీ ట్రాఫిక్ కానిస్టేబుల్
అందుకే ఈ ఫ్యాన్సీ డ్రెస్!

# • మిక్స్చర్ పొట్లం

బొమ్మలు : వెంకట్

## కలలు కల్లలు

"మీరు నాకు డైమండ్ నెక్లెస్ కొనిస్తున్నట్టు రాత్రి కలొచ్చింది" చెప్పింది భార్య.

"అవునవును. బిల్ మీ డాడీ ఇస్తున్నట్టు నాకూ వచ్చింది" చెప్పాడు భర్త.

## బాధితులు

"తోడల్లుడు అంటే ఎవరు నాన్నా?" అడిగాడు పుత్రుడు.

"ఒకే కంపెనీ వలన మోసపోయిన ఇద్దరు కష్టమర్లు" చెప్పాడు తండ్రి.

## అత్తగారూ - కొత్త కోడలు



సిటీలో పుట్టి పెరిగిన అమ్మాయి పల్లెటూరి అబ్బాయిని పెళ్లాడింది. అత్తవారింటికి వెళ్లిన మొదటి రోజు -

"గడ్డి తీసుకెళ్లి గేదెముందు వేసిరామ్మా" అత్త పని పురమాయించింది.

గడ్డి తీసుకెళ్లిన కోడలికి గేదె నోట్లో నురగ కనిపించి వెనక్కి వచ్చేసింది.

"గడ్డి వెనక్కి తెచ్చేశావెందుకు?" అడిగింది అత్త.

"అది ఇంకా మొహం కడుక్కోలేదండి. బ్రష్ చేసుకుంటోంది" చెప్పింది కొత్త కోడలు.

## తాగుబోతుతో పెట్టుకోకు



పోలీస్ : ఎక్కడుంటావు?
తాగుబోతు : మా పేరెంట్స్‌తో.
పోలీస్ : వాళ్లెక్కడుంటారు?
తాగుబోతు : నా దగ్గరే.
పోలీస్ : మీ ఇల్లెక్కడ?
తాగుబోతు : మా పక్కింటి పక్కన.
పోలీస్ : మీ పక్కిల్లు ఎక్కడ?
తాగుబోతు : నేను చెప్పినా మీరు నమ్మరు.
పోలీస్ : నమ్ముతా ... చెప్పు.
తాగుబోతు : మా ఇంటి పక్కనే.

## ఆరంభశూరుడు



"ఎక్కడికెళ్తున్నారు?" అడిగింది భార్య.

"ఆత్మహత్య చేసుకోవడానికి" చిరాగ్గా బదులిచ్చాడు భర్త.

"ఈ సంచి పట్టుకెళ్లండి" అందించింది భార్య.

"ఎందుకు?" అడిగాడు భర్త.

"మీరు మధ్యలో నిర్ణయం మార్చుకుంటే, వచ్చేప్పుడు కిలో వంకాయలు, అరకేజీ చింతపండు తీసుకురండి" చెప్పి హడావిడిగా ఇంట్లోకి వెళ్లింది భార్య.

## షాపింగే నేరమౌనా?

"నిన్ను ఎందుకు అరెస్టు చేశారు?" అడిగాడు జడ్జి.

"షాపింగ్ చేసినందుకు" చెప్పాడు గంగులు.

"అదేమంత నేరం కాదే .. దానికెందుకు అరెస్టు చేశారు?" అడిగాడు జడ్జి.

"షాపు తెరవకముందే షాపింగ్‌కు వెళ్లానని" చెప్పాడు గంగులు.

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'గౌట్' సమస్యకు సమర్థవంతమైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

మన ప్రతి కదలికలో కీళ్ళ పాత్ర ప్రధానమైనది. ఇంతటి ప్రాధాన్యం సంతరించుకున్న కీళ్ళలో ఉదయాన్నే నిద్ర లేచేసరికి కాలి బొటనవ్రేలులో వాపు, సలపరంతో కూడిన నొప్పి మరియు ఆ కీళ్ళకు సంబంధించిన ప్రతి చిన్న కదలిక కూడా అత్యంత కష్టతరంగా అనిపించడం వంటి సమస్యలు కేవలం 'గౌట్' అనే వ్యాధి వలన మాత్రమే కలుగుతాయని మనం తెలుసుకోవాలి.

గౌట్ వ్యాధి మన శరీరంలో యథావిధిగా జరిగే యూరిక్ ఆమ్లపు జీవ ప్రక్రియ సరిగ్గా లేనందున ఉత్పన్నమయ్యే ఒక కీళ్ళవ్యాధి. ఒక అధ్యయనం ప్రకారం 2013వ సం॥ నాటికే దాదాపు 5.8 మిలియన్ల మంది ఈ సమస్యతో బాధపడుతున్నారని తేలింది. మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్ల వలన ఈ సమస్య నానాటికీ పెరుగుతూనే ఉంది. స్త్రీల కంటే పురుషులలో 3 రెట్లు అధికంగా ఈ సమస్య కనిపిస్తోంది. 30 సం॥లు దాటిన పురుషులలో మరియు నెలసరి ఆగిపోయిన స్త్రీలలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది.




సాధారణంగా మనం తీసుకునే ఆహారంలో ఉండే ప్యూరిన్స్ విచ్ఛిన్నంలో భాగంగా ఏర్పడే యూరిక్ ఆమ్లం రక్తంలో ఉండవలసిన పరిమాణం కంటే అధికంగా ఉన్నట్లయితే, అది కీళ్ళలోకి వచ్చి చేరుతుంది. ఇలా చేరిన యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు కీళ్ళలో మరియు కీళ్ళ చుట్టూ ఉండే కణజాలంలో వచ్చి చేరినప్పుడు కీళ్ళు వాచిపోయి - కదలికలు కష్టతరంగా మారడాన్ని గౌట్ అని అంటారు. దీని వలన కీళ్ళు హానికి గురవుతున్నాయి కనుక దీనిని 'గౌటీ ఆర్థ్రైటిస్' అని కూడా అంటారు.

**కారణాలు:** సాధారణంగా రక్తంలో ఉన్న యూరిక్ ఆమ్లం, కిడ్నీల నుండి మూత్రం ద్వారా విసర్జించబడుతుంది. ఒకవేళ శరీరంలో యూరిక్ ఆమ్లం ఉత్పత్తి పెరిగినా లేదా దాని విసర్జన సరిగా జరగకపోయినా, ఈ రసాయనం రక్తంలో నిలిచిపోవటంతో, గౌట్ వ్యాధి ఉత్పన్నమవుతుంది. • ప్యూరిన్స్ ఎక్కువగా ఉండే ఆహారం, ఉదా: మాంసం, గ్రుడ్లు, చేపలు మొదలైన సముద్రపు ఆహారము ఎక్కువగా తీసుకోవడం. • అధిక బరువు, వయస్సు పెరగడం, వంశపారంపర్యత • కొన్ని కిడ్నీ సంబంధిత వ్యాధుల వలన యూరిక్ ఆమ్లం విసర్జన ప్రక్రియలో లోపాలు ఏర్పడటంతో గౌట్ (Gout) వ్యాధి వచ్చే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు:** మొదట్లో ఈ వ్యాధి కాలి బొటన వ్రేలుకు మాత్రమే పరిమితమైనప్పటికీ, క్రమేపీ ఇది మోకాళ్ళను, మడమలను, మోచేతులను మరియు మణికట్టుతోపాటు ఇతర వ్రేళ్ళను కూడా ప్రభావితం చేస్తుంది. • ఈ సమస్య పట్ల నిర్లక్ష్యం వహించి, సరైన చికిత్స తీసుకోకపోతే వ్యాధి తీవ్రతరం అయి, కీళ్ళను పూర్తిగా దెబ్బ తీస్తుంది మరియు ఈ వ్యాధి మూలంగా కిడ్నీలో రాళ్ళు కూడా ఏర్పడే అవకాశం ఉంటుంది.

**వ్యాధినిర్ధారణ పరీక్షలు:** **రక్తపరీక్ష** - రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువైనంత మాత్రాన గౌట్ వ్యాధికి గురి అయినట్లు భావించరాదు. రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉండటంతో పాటు, కీళ్ళలో ఆర్థ్రైటిస్ సమస్య కూడా ఉన్నట్లయితే 'గౌట్' వ్యాధిగానే భావించాలి. • సోరియాటిక్ ఆర్థ్రైటిస్, కిడ్నీ ఫెయిల్యూర్, లుకేమియా వంటి ఇతరత్రా సమస్యలలో కూడా యూరిక్ ఆమ్లపు శాతం ఎక్కువగా ఉండే అవకాశం ఉంటుంది. కాబట్టి గౌట్ విషయంలో రోగ నిర్ధారణ చాలా కీలక పాత్ర పోషిస్తుంది. • ఈయస్ఆర్, X-Ray, అల్ట్రా సౌండ్ (యూరిక్ ఆమ్ల స్ఫటికాలను గుర్తించడంలో సహాయపడే పరీక్ష) మరియు • కీళ్ళలోని ద్రవాన్ని తీసి పరీక్షించడం వంటి పరీక్షల ద్వారా ఈ వ్యాధిని నిర్ధారించుకోవచ్చు.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** గౌట్ వ్యాధితో బాధపడేవారు, వారు తీసుకునే ఆహారంలో మాంసకృత్తులను బాగా తగ్గించాలి. • మామూలుగా మాంసకృత్తులు (ప్రోటీన్లు) రెండు రకాలు. అవి **ప్యూరిన్స్** మరియు **పిరమిడైన్స్**. • గౌట్ బాధితులు ప్యూరిన్స్ ఎక్కువగా ఉండే ఆహారాన్ని -అంటే ముఖ్యంగా మాంసాహారంలో భాగంగా మేక మరియు గొర్రె మాంసం తినరాదు మరియు బీఫ్ వంటివి కూడా తీసుకోకూడదు. అలాగే లివర్, కిడ్నీ, ఎముక మూలుగ, ప్రేగుల వంటి జంతు అంతర్గత అవయవాలు తీసుకోరాదు. • ఇంతేకాకుండా పాలకూర, క్యాబేజీ, క్యాలీఫ్లవర్, చిక్కుళ్ళు, వివిధ రకాల బీన్స్, పుట్ట గొడుగులు వంటి శాకాహారాలు తగ్గించాలి. • మద్యపానాన్ని మానివేయడం మంచిది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే అధునాతన కాన్స్టిట్యూషనల్ హోమియో వైద్య విధానం ద్వారా, రోగి యొక్క మానసిక మరియు శారీరక స్థితిగతులను క్షుణ్ణంగా విచారించి, సరైన చికిత్స అందించడం ద్వారా గౌట్ వ్యాధిని పూర్తిగా నివారింపజేయడం జరుగుతుంది. అంతేకాకుండా కీళ్ళలో మరోసారి స్ఫటికాలు ఏర్పడకుండా మరియు రక్తప్రసరణ లోని వివిధ రసాయనాల సమతుల్యతను స్థిరంగా ఉంచేలా తగిన జాగ్రత్తలు తీసుకోవడంతో గౌట్ వ్యాధి సమర్థవంతంగా మరియు శాశ్వతంగా నయం కాబడుతుంది.

**టోల్ ఫ్రీ 1800 108 1212** | **కన్సల్టేషన్ ఉచితం 955 000 1199** | **www.homeocare.in**

ఈ వారం కథ

ఇంటిముందు ఆటో దిగి గేటు తీసుకొని లోపలికి వచ్చింది లలిత. ఎప్పట్లానే తాళంకప్ప ఆమెని పలకరించింది. దాన్ని చూసి నిర్లిప్తంగా నవ్వుకుంది. రెండువేల నూట రెండోసారో, నాలుగువేల రెండొందల ఒకటోసారో తాళం తీయడానికి ఆమె తాళపు చెవిని బ్యాగులోనుంచి తీసింది. ఒకప్పుడంటే పిల్లల్లో ఎవరో ఒకరు ఇంట్లో ఉండేవారు. వాళ్ల పెళ్లిళ్లు చేసుకుని ఎక్కడివాళ్లక్కడ స్థిరపడ్డ దగ్గరనుండి రోజూ తాళంకప్ప పలకరింపే.

# నాలుగోతరం

● జి. లక్ష్మి 

"మల్లెపూలు రెండు మూరలు తీసుకోనా?" పక్కింటాయన గుమ్మంలో నిలబడి వాళ్ల ఆవిడని అడుగుతున్నాడు. నిన్న ఇదే టైముకి ఇదే పక్కింటాయన ఏదో పని సరిగా చేయలేదని ఆవిడని పట్టుకుని తిడుతున్నాడు. రాజకీయాల్లోలాగానే పెళ్లిళ్లలో కూడా శాశ్వత మిత్రులు, శాశ్వత శత్రువులు ఉండరేమో అనుకుంది లలిత.

లోపల టీపాయ్ మీద పేపర్లూ, మేగజైన్లూ చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. హాల్లో కుర్చీమీద తడి టవలు ముద్దలా వేసి ఉంది. డైనింగ్ టేబుల్ మీద సగం తిని వదిలేసిన పళ్లెం, మూతల్లేని నేతిగిన్నె, పచ్చడిసీసా ... చూడగానే ఆమె ప్రాణం ఉసూరుమంది. టవలు బైట ఆరేసి, పళ్లెం తీసి సింకులో వేసింది. తిన్న తర్వాత గిన్నెలు మూతపెట్టమని, ఏమన్నా మిగిలినప్పుడు ఫ్రిజ్‌లో పెడితే రాత్రికి వేసుకోవచ్చని సాగర్‌కి చెప్పి చెప్పి విసుగొచ్చి వదిలేసింది.

వంటింట్లోకి వెళ్లి రెండు గ్లాసుల మంచినీళ్లు తాగి స్టౌవ్ మీద టీకి నీళ్లు పడేసింది. లలిత పనిచేసే స్కూల్లో బాత్‌రూమ్‌లు సరిగ్గా ఉండవు. దాన్లోకి వెళితే వాంతి వచ్చినంత పనవుతుంది. అందుకే స్కూల్లో ఉన్నంతసేపూ లలిత మంచినీళ్లు తాగదు. దాహం అనిపించినప్పుడు గుక్కెడు నీళ్లతో గొంతు తడుపుకుంటుంది. ఇంట్లో ఉన్నప్పుడు ఆవార ఎక్కువ తాగుతుంది.

టీని కప్పులో పోసుకుని సోఫాలో కూర్చుంటూ టీవీ ఆన్ చేసింది. చూస్తే రిమోట్ పనిచేయడం లేదు. సెల్ అయిపోయింది. రాత్రే చెప్పింది సాగర్‌కి సెల్ తీసుకొచ్చి వేయమని. మర్చిపోయినట్టున్నాడు. ఇదివరకంటే టీవీ రెగ్యులర్‌గా చూసేవాడు. ఇప్పుడు కంప్యూటర్ ముందు కూర్చుని టీవీని వదిలేశాడు. టీవీ చూసేది లలితే. కోపంతో రిమోట్‌ని నేలకేసి బాదాలనిపించింది. సాగర్‌కి ఏపని చెప్పినా అంతే. ఏదీ ఒక పట్టాన చేయడు. చెప్పి చెప్పి లలిత నోరు అరిగిపోవలసిందే.

లలిత స్కూల్ నుంచి వచ్చే టైమ్‌కి సాగర్ ఇంట్లో ఉంటే అంత ఇబ్బంది ఉండదు. స్కూలు అయిన తర్వాత గంట ప్రయాణం చేస్తే కానీ ఇంటికి రాలేదు. సాగర్ ఆఫీసు ఊళ్లోనే. ఇంటికి వచ్చి తయారై మళ్లీ టెన్నిస్ ఆడడానికి వెళ్లిపోతాడు. అక్కడే టిఫిన్ చేసేసి ఏ రాత్రికో ఇంటికి వస్తాడు. పొద్దున్నే స్కూల్‌కి వెళ్లే హడావిడిలో ఏదీ గుర్తుండదు. లలిత గుర్తుంచుకుని వస్తూ సూపర్ బజార్‌లో కావలసినవి తెచ్చుకుంటుంది. ఏది లేకపోయినా మళ్లీ ఫర్లాంగు దూరం నడిచి వెళ్లాలి. కనీసం తను వచ్చేవరకన్నా ఇంట్లో ఉండమని సాగర్‌కి చెప్పి చెప్పి అలసిపోయింది లలిత. టెన్నిస్ ఆడడానికి వెలుతురు పోతుందని మాట వినడు.

అట్లా ఏదన్నా అవసరం వచ్చినప్పుడు తెమ్మని చెప్పినవి సాగర్ తెచ్చి ఉంచనప్పుడు లలితకి పిచ్చి కోపం వచ్చేస్తుంటుంది. మొదట్లో వంట గిన్నెలు నేలకోసి కొట్టేది. అలమర తలుపులు, బీరువా తలుపులు ధడధడా వేసి కొట్టేది. అయితే దాని మూలంగా కలిగే నష్టం లలిత త్వరలోనే గ్రహించింది. గిన్నెలన్నీ చొట్టలు పడి పాడవుతున్నాయి. ఇక తలుపుల్లాంటివి రిపేర్లు వస్తే ఇంక వాటి గతి అంతే. సాగర్ ఓ పట్టాన బాగు చేయించడు. అందుకే ఈ మధ్య లలిత కోపం తీరడం లేదు. పైగా కోపంగా ఏదన్నా విసిరి కొట్టినప్పుడల్లా పొట్టలో ఏదో కదులుతున్నట్టు, ఎక్కడో పట్టుకున్నట్టు ఇబ్బందిగా ఉంటోంది. అది ఏమై ఉంటుందో ... అమ్మమ్మ చెప్పింది అయితే అది కాదు కదా అని లలిత భయం.

"రోజూ బైటకు వెళ్లకపోతే ఎప్పుడన్నా కాస్త ఇంట్లో ఉండొచ్చు కదా" ఓరోజు సాగర్‌ని గట్టిగానే అడిగింది.

"ఉండి చేసేది ఏముంది? ఇంట్లో టీవీ ముందు కూర్చోవడమేగా. నేను ఉన్నంత మాత్రాన ఒరిగేదేంటి? సరే. ఇంట్లో ఉంటాను. ఉండి ఏం చేయాలో చెప్పు?"

"ఏదన్నా చేయాలంటేనే ఉండాలా! ఊరికే



బొమ్మలు : **చారి పి.యస్.**

ఉండకూడదా?"

"అట్లా ఊరికే ఉండాలంటే బోర్ కొడుతుంది. అయినా ఉంటే నీకేం వస్తుంది చెప్పు?"

భర్త ఇంట్లో ఉంటే భార్యకి ఏం వస్తుంది? సాయంత్రాలు రోడ్ల మీద కాలక్షేపం చేయకుండా భర్త ఇంట్లో ఉంటే ఆ భార్యకు ఏం వస్తుంది? ఆ ప్రశ్నకు ఏ భార్య మాత్రం ఏం సమాధానం చెబుతుంది. అందుకే లలిత కూడా సాగర్‌కి ఏం చెప్పలేకపోయింది. ఇంటికి వచ్చే సమయానికి ఇంటికి తాళం కప్ప కాకుండా ఇంట్లో ఓ మనిషి ఉంటే ఇంటికి రాబుద్ధి అవుతుందని లేకపోతే ఇంటికి రావాలని కూడా అనిపించదని లలిత అతనికి చెప్పి ఒప్పించలేకపోయింది. ఇంట్లో ఒక మనిషి ఉండి కబుర్లు చెప్పుకుంటూ కలిసి టీ తాగడంలోనో, అన్నం తినడంలోనో, టీవీ చూడడంలోనో ఉండే ఆనందం గురించి అసలు ఒప్పించలేకపోయింది. ఏది చెప్పినా దాన్ని తేలిగ్గా కొట్టిపడేయడం సాగర్‌కి అలవాటు. రిటైర్మెంట్‌కి మూడేళ్ల కంటే వ్యవధి లేదు. ఇప్పటికీ మనిషిలో మార్పు రాలేదు.

ఒకరోజు లలితకి కోపం వచ్చిందనుకున్నాడో ఏమో ఇంట్లో ఉండిపోయాడు. కాసేపు టీవీ ముందు కూర్చుని ఛానెల్స్ తిప్పి తిప్పి చూస్తూ మధ్య మధ్య లలిత మొహం వంక చూస్తున్నాడు. లలిత ఏం గమనించనట్టు ఉండిపోయింది.

"ఇంట్లో ఉండడం లేదు ... ఉండడం లేదు అని ఊరికే గోల పెడతావు. ఇదిగో ఉన్నాగా. ఏం చేయాలో చెప్పు? నా మొహం నువ్వూ, నీ మొహం నేనూ చూసుకోవడమేగా" అన్నాడు అసహనంగా. లలిత విననట్టే ఉండిపోయింది.

ఏదో ఫోన్ వస్తే "అబ్బే, అదేం లేదు బ్రదర్. వంట్లో బానే ఉంది. ఏదో చిన్న పనుండి ఉండిపోయా. ఏం చేస్తున్నారు? మన వాళ్లంతా వచ్చారా? ఓ ష్యూర్. రేపు కచ్చితంగా వచ్చేస్తాను" అని చెప్పడం వింటూనే ఉంది లలిత. ఆ చెప్పడం తనకి కూడా అని ఆమెకి అర్థమయింది.

"మా ప్రసాద్ ఫోను. నేను లేకపోతే వాళ్లకు బాగా బోర్ కొట్టేసిందంట. చెప్పా చెయ్యకుండా మానేశానని నాకు వంట్లో బాగోలేదేమో అని ఫోన్ చేశాడు. నువ్వేమో ఇంట్లో ఉండండి అంటావు. ఉండి ఏం చేయాలంటే చెప్పవు" అతని గొంతులో విసుగు. దాని తర్వాత ఆమె అతన్ని ఉండమనీ అనలేదు. సాగర్ ఉండనూలేదు.

స్కూల్ నుంచి రావటం, టీవీ ముందు కూర్చుని కాలక్షేపానికి పనికిమాలిన ప్రోగ్రాములన్నీ చూడడం, నిరాసక్తంగా తిండి తినడం రాను రాను లలితకు జీవితం మీదే ఒకలాంటి నిరాసక్తత వచ్చేసింది. ఆ నిరాసక్తత తన మీదా, తన ఆరోగ్యం మీదా మెల్లమెల్లగా పాకింది. అంతకు ముందు సాగర్ ఇంటికి రాగానే ఆ రోజు స్కూల్లో జరిగినవన్నీ టకటకా పాఠం చెప్పినట్టు చెప్పేది. ఈ మధ్య ఆమెలో మౌనం పేరుకుపోతోంది. ఏది చెబుదామన్నా అది చెప్పకపోతే ఏం పోయింది అన్నట్టు ఊరుకుంటోంది. టెన్నిస్ నుంచి వచ్చి కాసేపు సెల్‌తో, కాసేపు కంప్యూటర్‌తో గడిపే సాగర్ లలితలో వచ్చిన మార్పు అంతగా గమనించలేదు. భార్యని మించిన మంచి కాలక్షేపం కంప్యూటర్ అని అతను గ్రహించి చాలా కాలమైంది. పైగా అది ఎలాంటి ఘర్షణ, వాదోపవాదాలు లేని కాలక్షేపం కూడా. అతను ఏం చెప్పినా కంప్యూటర్ వింటుంది. ఎదురు మాట్లాడదు. అవునన్న దాన్ని కాదనదు. అందుకే లలిత ఒకరకంగా ఒంటరి జీవితానికి అలవాటు పడిపోతే సాగర్ ఆఫీసుకి, టెన్నిస్‌కి, కంప్యూటర్‌కి అంకితమైపోయాడు.

టీవీ ముందు నుంచి లేచి బియ్యం కడిగి పెడదామని చూసింది లలిత. ఖాళీ బియ్యం డబ్బా వెక్కిరించింది. నాలుగు రోజుల్నుంచి చెబుతోంది సాగర్‌కి. పొద్దున చెబితే రాత్రి, రాత్రి చెబితే పొద్దున తెస్తానని కాలక్షేపం చేస్తున్నాడు తప్ప తేలేదు. పొద్దున మరీ మరీ చెప్పింది - రాత్రికి బియ్యం లేవు తెచ్చిపెట్టి టెన్నిస్‌కి వెళ్లమని. సాగర్‌కి చెప్పింది కాబట్టి

వనజ మాత్రమే కాదు చాలమంది అదేమాట అంటుంటారు. అదేదో భర్తలకు తాగుడు, సిగరెట్, పేకాట అలవాటు లేనంత మాత్రాన వాళ్లంతా మంచివాళ్లయిపోయినట్టు. వాళ్ల భార్యలందరూ సుఖంగా, సంతోషంగా ఉన్నట్టు. కానీ ఇల్లు పట్టని, బాధ్యత లేని భర్త వాళ్లందరికన్నా భార్యను ఇంకా ఎక్కువగా బాధించగలడని ఎలా తెలుస్తుంది?

అతను తెస్తాడని ఇంక ఆ విషయం మర్చిపోయింది. తెచ్చి ఇంకెక్కడైనా పెట్టాడేమోనని ఇల్లంతా వెతికింది. ఎక్కడా కనిపించలేదు. ఆకలి, నీరసం కలగలిసిన ఉక్రోషంతో ఆమె మనసు ఒక్కసారిగా ఉడికిపోయింది. గుండెల్లోంచి లావాలాగా పైకి ఏదో ఎర్రగా ఎగజిమ్మింది. గొంతులోంచి అస్పష్టంగా ఒక అరుపు బయటపడింది. చుట్టు పక్కల ఇళ్లన్నీ ఆ సమయంలో టీవీ సీరియళ్లలో గాఢంగా మునిగిపోయి వాటి ప్రభావం చేత కన్నీటితో తడిసిపోతూనో, ప్రతీకారంతో రగిలిపోతూనో ఉండి ఉంటాయి. అందుకని లలిత అరుపు నిశ్శబ్దంగా గాలిలో కలిసిపోయింది. బలంగా బియ్యపు సోలని నేలకేసి కొట్టేసరికి పొట్టలో మళ్లీ కలుక్కుమంది.

ఒంగొని కిందపడిన సోలని తియ్యబోయింది. కడుపులో మళ్లీ ఏదో పట్టుకున్నట్టు, ఏదో అటు నుంచిటు కదిలినట్టు ... సోల తీసే ప్రయత్నం మానుకుని తింటానికి ఏమున్నాయో అని ఫ్రిజ్ డోర్ తీసింది. రెండు రోజుల కిందట ఇద్దరికి ఎటూ చాలదని ఉంచేసిన అట్లపిండి కనిపించింది. దాంతో అట్లు వేసుకు తిని మంచినీళ్లు తాగిన తర్వాత ఆకలి శాంతించింది.

స్కూల్లో పిల్లలకు హోం వర్క్ ఇచ్చినట్టే సాగర్‌కి కూడా రోజూ హోమ్ వర్క్ ఇచ్చి ఈ పని చేయాలి అంటే చేస్తాడు. వస్తూ వస్తూ కూరగాయలు తేవాలంటే తెస్తాడు. సరుకులు తేవాలంటే తెస్తాడు. ఏది చెప్పినా అంతవరకు చేసి ఊరుకోవడం అది కూడా ఏదో మొక్కుబడిగా లలిత చెప్పింది కాబట్టి చేసేవాడు తప్ప ఇంటికోసం చేస్తున్నానన్న ఫీలింగ్ అతనిలో కనిపించేది కాదు. చెప్పకపోయినంత మాత్రన ఇంటికి ఏం కావాలో తనంతట తనకి తట్టవద్దా అని గింజుకునేది లలిత. పిల్లలకు హోంవర్కు ఇవ్వటం బాగానే ఉంటుంది. కానీ రోజూ భర్తకు కూడా హోమ్‌వర్కు ఇవ్వడం ఏ భార్యకు మాత్రం బాగుంటుంది?

ఒకరోజు స్టాఫ్‌రూమ్‌లో వనజ కళ్లమ్మట నీళ్లు పెట్టుకుంటోంది. ఎందుకని అడిగితే "మీకేమండీ .. సాగర్‌గారు డ్రింక్ చేయరు. పేకాడరు. సిగరెట్ కూడా తాగరు. కనీసం వక్కపొడి అలవాటు కూడా లేదు. ఎంత అదృష్టం అలాంటి వాడు దొరకడం. మీకు ఎంత చెబితే మాలాంటి వాళ్ల బాధలు అర్థమవుతాయండి" అనేసింది. వనజ మాత్రమే కాదు చాలమంది అదేమాట అంటుంటారు. అదేదో భర్తలకు తాగుడు, సిగరెట్, పేకాట అలవాటు లేనంత మాత్రాన వాళ్లంతా మంచివాళ్లయిపోయినట్టు. వాళ్ల భార్యలందరూ సుఖంగా సంతోషంగా ఉన్నట్టు. కానీ ఇల్లు పట్టని, బాధ్యత లేని భర్త వాళ్లందరికన్నా భార్యను ఇంకా ఎక్కువగా బాధించగలడని వాళ్లకు ఎలా తెలుస్తుంది?

పిల్లల విషయం కూడా అంతే. ఏదో గాలికి పుట్టి గాలికి పెరిగారు. వాళ్ల అదృష్టం బాగుండి ఉద్యోగాలొచ్చి పెళ్లిళ్లయిపోయినై. ఇల్లు కడుతున్నప్పుడూ అంతే. చిరచిరలాడి పోయేవాడు. "ఇప్పుడు ఇల్లు కట్టకపోతే ఏం పోయింది? మంచి ఇంట్లోనే ఉంటున్నాంగా. నీకు వచ్చిన నష్టం ఏముంది?" అనేవాడు. రాను రాను సాగర్‌ని చూసే కొద్దీ లలితకి ఒక విషయం అర్థమయింది. ఆయనకి బాధ్యతలంటే భయం. తన రోజువారీ కార్యక్రమాలకీ, సరదాలకీ, తిరుగుళ్లకీ ఎక్కడ ఆటంకం కలుగుతుందోనన్న భయం. అతనికి జీవితమంతా ఎలాంటి బాదరబందీ లేకుండా సరదాగా పిక్నిక్‌లా జరిగిపోవాలి. పిక్నిక్‌లా సాగిపోవడానికి జీవితం పిక్నిక్ కాదు కదా. రకరకాల బాధ్యతలు, ఒడిదుడుకులతో కూడుకున్నదే జీవితం! దేనికైనా పూర్తి బాధ్యత తీసుకోవడం సాగర్‌కి ఇష్టముండదని ఆమెకు అర్థమయింది. ఇష్టం ఉండకపోవడం అనేదానికన్నా అది అతనికి చేతకాదు అనికూడా ఆమెకు క్రమంగా తెలిసి వచ్చింది.

ఒక తెలివిగా మాట్లాడ్డం రాదు. ఫైనాన్షియల్ మేనేజిమెంటు తెలియదు. ఏది ఎప్పుడు చేయాలో తెలీదు. ఎలా చేయాలో చెప్పినా చెయ్యడం తెలీదు. ఇలా బాధ్యతారాహిత్యం, చేతగానితనం ఫలితాలను రకరకాల రూపాల్లో చూసి చూసి లలిత విసిగిపోయింది.

ఏదైనా వ్యవహారం నడపడం చేతగాని వాళ్లు చేతగాని వాళ్లుగా, నడపగలిగిన వాళ్లు సమర్థులుగా పేరు తెచ్చుకుంటారు. అదే భార్యాభర్తల్లో అయితే అలా వ్యవహారం నడపడం చేతగాని వాడు మంచివాడుగా పేరు తెచ్చుకుంటే, నడపగలిగిన భార్య గయ్యాళిగా పేరు తెచ్చుకుంటుంది. లోకం దృష్టిలో సాగర్ అలా మంచివాడయ్యాడు.

"చేతకాని మొగుళ్లు చివరకు పెళ్లాల కడుపుల్లో పుండ్లుగా తేలతారే" అనేది లలిత అమ్మమ్మ.

"ఎందుకు అమ్మమ్మా?" అడిగింది లలిత ఒకసారి.

"చేతకాని మొగుడిని బతుకంతా భుజాలపై మోసీ మోసీ, ఇంటి గుట్టంతా కడుపులో దాచీ దాచీ అది పేరుకుని, పేరుకుని చివరికి పుండుగాక ఇంకేమవుతుంది" అంది.

లలిత తాత వట్టి మేదకుడు. అతని అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకుని ఆస్తి పంపకాల్లో వాళ్ల అన్నలు అన్నీ పనికిరాని పొలాలు అంటకట్టారట. దానితో లలిత అమ్మమ్మే అన్నీ చేసుకునేది. ఆవిడ భర్తకు పొలం పనిని హోంవర్క్‌గా ఇచ్చేది. ఇవ్వడమే కాదు దగ్గరుండి మరీ చేయించేది. కాబట్టే నలుగురు పిల్లల్ని ఒకదారి చేయగలిగాను అనేది ఎప్పుడూ.

"మరి నీకు ఏదీ రాలేదుగా అమ్మమ్మా" లలిత ఆవిడని అడిగేది.

"నేనంటే స్వయం సిద్ధనే. నా పరిస్థితి వేరు. మీ తాతయ్య తెలివి తక్కువవాడని దాచి పెట్టి పెళ్లి చేశారు. ఆయన ఏమీ చేయలేడని తెలుసు కాబట్టి ఆయన్నుంచి నేనేమీ ఆశించలేదు. అన్నీ నేనే చూసుకునేదాన్ని. ఎవరి నుంచీ ఏమీ ఆశించనప్పుడు ఇంక బాధేముంది? మీ అమ్మ మీ నాన్న ఏదేదో చేయాలని ఆశించింది. అది తీరక దానికి కడుపులో పుండు పుట్టి పోయింది" అంది.

లలిత వాళ్ల నాన్న వట్టి బోళా రకం. రాజకీయాలు మాట్లాడమంటే గంటలు గంటలు మాట్లాడతాడు కానీ ఒక వ్యవహారం నడపాల్సి వస్తే ఎలా నడపాలో ఆయనకు చేతయేది కాదు. దేశంలో ఎక్కడ ఏం జరిగినా అన్నీ ఆయనకే కావాలి. ఇంట్లో జరిగేది మాత్రం తెలీదు.

లలిత వాళ్ల అమ్మ కూడా భర్తకు హోం వర్క్ ఇచ్చేది. ఏదన్నా పనిచేయాల్సి వచ్చినప్పుడు ఏం చేయాలో ఎట్లా మాట్లాడాలో అన్నీ చెప్పి పంపేది. ఆయన



"నేనంటే స్వయం సిద్ధనే. నా పరిస్థితి వేరు. మీ తాతయ్య తెలివి తక్కువవాడని దాచి పెట్టి పెళ్లి చేశారు. ఆయన ఏమీ చేయలేడని తెలుసు కాబట్టి ఆయన్నుంచి నేనేమీ ఆశించలేదు. అన్నీ నేనే చూసుకునేదాన్ని. ఎవరి నుంచీ ఏమీ ఆశించనప్పుడు ఇంక బాధేముంది? మీ అమ్మ మీ నాన్న ఏదేదో చేయాలని ఆశించింది. అది తీరక దానికి కడుపులో పుండు పుట్టి పోయింది"

వచ్చేవరకూ గుమ్మం దగ్గరే నిలబడి చూస్తుండేది. ఆయన ఎప్పుడూ హోంవర్క్ సరిగ్గా చేసేవాడు కాదు. వాళ్ల అమ్మ ఎంత చెప్పి పంపినా అన్నీ అరకొరగానే చేసుకొచ్చేవాడు. దాని తాలూకూ అసంతృప్తి ఎప్పుడూ లలిత వాళ్ల అమ్మ మొహం మీద వేలాడినట్టే ఉండేది. "మీ నాన్నలాంటి మొగుడ్ని పెట్టుకుని ఆడపిల్లల్ని ఎలా కడతేరుస్తుందో మీ అమ్మ" అనేది లలిత అమ్మమ్మ ఎప్పుడూ.

పెద్దమ్మలు, పిన్నిలు, అత్తయ్యలు అందర్నీ వాళ్ల ఇంటి వ్యవహారాలన్నిటినీ చూస్తూనే పెరిగి పెద్దదయింది లలిత. ఆ క్రమంలో ఆమెకు ఒకటి అర్థమవుతూ వచ్చింది. ఏ ఇల్లయినా నిలబడడానికి కారణం మగవాళ్ల దక్షత కాదు, ఆడవాళ్ల దక్షతేనని. భర్తలు ఎట్లా ఉన్నా భార్యలు తెలివైన వాళ్లయితేనే ఆ ఇళ్లు నిలబడుతున్నాయి. భార్యలకు తెలివితేటలు లేని ఇళ్లు దెబ్బతింటున్నాయని.

లలిత ఫిజిక్స్ లెక్చరరు ఒకాయన సరదాగా ఉండేవాడు. లాబ్‌లో ప్రాక్టికల్స్ చేస్తుంటే అందరిచుట్టూ తిరుగుతూ "భర్తలు థియరీల్లాంటి వాళ్లురా అబ్బాయ్. భార్యలు ప్రాక్టికల్. అందుకే ప్రాక్టికల్స్‌లో ఎప్పుడూ అమ్మాయిలే ఫస్ట్" అనేవాడు.

ఏదన్నా అంటే నేర్పించగలం. బాధ్యతని ఎలా చెప్పి నేర్పించగలం అనుకునేది లలిత. దాన్ని ఏ స్కూళ్లు నేర్పుతాయి? ముందు మనం చేసే పనిమీద శ్రద్ధ ఉండాలి. జీవితం పట్ల, మన చుట్టూ ఉన్న మనుషుల పట్లా బాధ్యత ఉండాలి. దాని లోంచే ఏది ఎట్లా చెయ్యాలన్న అవగాహన కలుగుతుంది. అవన్నీ ఏదో పనికిమాలిన పనులు అనుకుంటే ఇంక పనికివచ్చే పనులు ఏవి? ఇంటికి ఉపయోగపడని వాడు తనకి తను ఏం ఉపయోగపడతాడు? ఇతర్లకి ఏం ఉపయోగపడతాడు?

ఏడాది కిందట గమనించింది లలిత పొట్టలో ఏదో అసౌకర్యంగా ఉండడం. ఏదో కదులుతున్నట్టు, గట్టిగా రాయిలా ఉన్నట్టు .. డాక్టరు అల్సర్ రావచ్చేమో అని అనుమానం వ్యక్తం చేసినప్పుడు చెప్పింది లలిత తనకి వేరే సమస్యలు లేవని, సాగర్ ఇల్లు పట్టించుకోడని. తనకున్న సమస్యల్లా అదేనని. అప్పుడు డాక్టర్ ఒకమాట చెప్పాడు.

"సమస్య అనుకుంటే సమస్య అవుతుంది. దాన్ని చూసి నవ్వడం నేర్చుకోండి. అప్పుడది సమస్య అనిపించకుండా పోతుంది" అని.

అప్పటినుంచీ లలిత నవ్వుతూనే ఉంది. నవ్వి నవ్వి అలసిపోతూనే ఉంది.

ఒకరోజు ... లండన్ నుంచి కూతురి ఫోన్. వెబ్‌కామ్ ఆన్ చేసింది. కూతురు ఇంట్లో అటూ ఇటూ తిరుగుతూ పనులు చేసుకుంటోంది. ఆమె మొహం కోపంతో ముడుచుకుపోయి ఉంది.

"అబ్బబ్బ .. ఈయనతో ఇంక నావల్ల కాదమ్మా. ఒక్క పనీ పట్టించుకోరు. అన్నీ నేనే చేసుకోలేక చచ్చిపోతున్నాను. ఇటు పుల్ల తీసి అటు పెట్టరు. ఇక్కడేమన్నా పనిమనుషులా పాడా! అన్నీ నేనే చేసుకోవాలి. అదే ఇండియా అయితే కనీసం పనిమనుషులన్నా దొరుకుతారు. ఇండియా నుంచి వచ్చిన మగవాళ్లు ఇంట్లో భార్యలకు సహాయం చేసేవాళ్లు ఎంతమంది లేరు? మరీ ఈయనే ఇల్లు పట్టకుండా ఏ మాత్రం బాధ్యత లేకుండా ..." చెబుతూనే ఉంది.

లలిత నవ్వబోయింది. తన వారసత్వం కూతురు అందుకోవడానికి సిద్ధంగా ఉంది. నాలుగుతరాల బతుకు రిలేలో కూతురు తన చేతిలోంచి కాగడా అందుకోబోతోంది. లలిత ఎప్పట్లా నవ్వలేకపోయింది.

**రచయిత్రి సెల్ : 94907 35322**



# సింగపూర్ నూడుల్స్

**కావలసిన పదార్థాలు:**

నూడుల్స్- 2 కప్పులు, ఉల్లిపాయ- 1, మిరియాలు- పావు టీ స్పూను, బఠాణీలు- 1 టేబుల్ స్పూను, చిక్కుడుకాయలు- పది (కత్తిరించకుండా అలాగే వేయాలి), సోయాసాస్- ఒక టేబుల్ స్పూను, కర్రీపౌడర్- 3 టీ స్పూన్లు, కొకొనట్ షుగర్ (మార్కెట్లో దొరుకుతుంది)- ఒక టేబుల్ స్పూను, నిమ్మరసం, నూనె- 2 టేబుల్ స్పూన్లు, వెల్లుల్లి ముద్ద- 2 టీ స్పూన్లు, పనీర్ ముక్కలు- అర కప్పు, తరిగిన క్యాప్సికమ్ (ఎర్రది)- ఒకటి, ఉల్లికాడలు- కొద్దిగా, ఉప్పు, కారం- తగినంత.

**తయారీ విధానం:**

నూడుల్స్‌ను వేడినీటిలో వేసి రెండు నిమిషాల తర్వాత తీసి ఆరబెట్టాలి. ఒక గిన్నెలో సోయాసాస్, వెల్లుల్లి ముద్ద, కొకొనట్ షుగర్, నిమ్మరసం వేసి కలిపి పక్కన పెట్టుకోవాలి. తర్వాత బాణలిలో ఒక టేబుల్ స్పూను నూనె పోసి వేడెక్కాక మిరియాలు, ఉల్లిపాయ ముక్కలు, క్యాప్సికమ్ ముక్కలు వేసి వేగించాలి. తర్వాత బఠాణీలు, సోయాసాస్ మిశ్రమం, సగం కర్రీపౌడర్ కూడా వేసి రెండు నిమిషాలు వేగించి దించి పక్కన పెట్టుకోవాలి. మరో బాణలిలో ఒక టేబుల్ స్పూను నూనె పోసి వేడెక్కాక నూడుల్స్ వేసి మిగిలిన సగం కర్రీపౌడర్ వేసి నిమిషం పాటు వేగించాలి. తర్వాత పనీర్ ముక్కలు, చిక్కుడు కాయలు, మిగిలిన పదార్థాలన్నిటినీ వేసి మరో 5 నిమిషాలు వేగించి దించేయాలి.

ఫుడ్ కోర్ట్

# న్యూడుల్స్



## పల్లీ నూడుల్స్

**కావలసిన పదార్థాలు:**

నూడుల్స్- 2 కప్పులు, చికెన్- పావు కిలో, సన్నగా తరిగిన గుమ్మడికాయ ముక్కలు- అర కప్పు, ఉల్లిపాయ- 1, క్యారెట్- 2, గుడ్లు- 2, వేగించిన పల్లీలు- అర కప్పు, సోయాసాస్- 3 టేబుల్ స్పూన్లు, వెనిగర్- ఒక టేబుల్ స్పూను, చిల్లీసాస్- ఒక టేబుల్ స్పూను, కొత్తిమీర- కొద్దిగా, నూనె- 2 టేబుల్ స్పూన్లు, కారం, ఉప్పు- తగినంత.

**తయారీ విధానం:**

నూడుల్స్‌ను వేడినీటిలో వేసి రెండు నిమిషాల తర్వాత తీసి ఆరబెట్టాలి. చికెన్‌ను ఉడకబెట్టి పక్కన పెట్టుకోవాలి. తర్వాత ఒక బాణలిలో ఒక టేబుల్ స్పూను నూనె పోసి వేడెక్కాక క్యారెట్, ఉల్లిపాయ, గుమ్మడికాయ ముక్కలు వేసి మూడు నిమిషాలు వేగించి పక్కన పెట్టుకోవాలి. ఆ తర్వాత మరో బాణలిలో ఒక టేబుల్ స్పూను నూనె పోసి వేడెక్కాక నూడుల్స్ వేసి వేగించాలి. తర్వాత సోయాసాస్, చిల్లీసాస్, వెనిగర్ వేసి నిమిషం పాటు వేగించాలి. తర్వాత గుడ్లు పగులకొట్టి వేసి ఉప్పు, కారం కూడా వేసి మరో అరనిమిషం పాటు వేగించాలి. ఆ తర్వాత పక్కనపెట్టుకున్న చికెన్, క్యారెట్, ఉల్లిపాయ, గుమ్మడికాయ ముక్కలు వేసి 2 నిమిషాలు వేగించాలి. చివరగా పల్లీలు వేసి మరో 2 నిమిషాలు వేగించి కొత్తిమీర జల్లి దించేయాలి.

## వెల్లుల్లి మ్యాగీ నూడుల్స్

**కావలసిన పదార్థాలు:**

మ్యాగీ నూడుల్స్- నాలుగుండే పెద్ద ప్యాకెట్, వెల్లుల్లి రెబ్బలు- పది, తరిగిన ఉల్లిపాయ- ఒకటి, గుడ్లు- మూడు, పచ్చిమిర్చి- ఒకటి, అల్లం తురుము- ఒక టీ స్పూను, ఉప్పు, కారం- ఒక్కో టీ స్పూను చొప్పున, చిల్లీసాస్- ఒక టీ స్పూను, నూనె- ఒకటిన్నర టేబుల్ స్పూను.

**తయారీ విధానం:**

మ్యాగీ నూడుల్స్‌ను సరిపడా నీళ్లు పోసుకుని ఉడికించి పక్కన పెట్టుకోవాలి. గుడ్లు పగలకొట్టి ఉప్పు, కారం, అల్లం తురుము వేసి రెండు నిమిషాలు వేగించి పక్కన పెట్టుకోవాలి. ఒక బాణలిలో నూనె పోసి వేడెక్కాక వెల్లుల్లి రెబ్బలను వేసి బంగారురంగు వచ్చేదాకా వేగించాలి. తర్వాత ఉల్లిపాయలు, పచ్చిమిర్చి, చిల్లీసాస్ వేసి మరో రెండు నిమిషాలు వేగించాలి. ఆ తర్వాత గుడ్ల మిశ్రమం, మ్యాగీ నూడుల్స్ కూడా వేసి చిన్న మంట మీద నిమిషం పాటు వేగించి దించేయాలి.



noodles




## నరకానికి నకలు

ఆఫ్రికా అనగానే ఎక్కువమందికి సహారా ఎడారే గుర్తుకు వస్తుంది. కాని ఆఫ్రికాలో ఇథియోపియాకు ఈశాన్య భాగంలో 'డనాకిల్' (Danakil) అనే మరో ఎడారి కూడా ఉంది. విష వాయువులను వెదజల్లే వేడినీటి ఊట బావులు, సజీవంగా ఉన్న అగ్ని పర్వతాలు కలిసి ఈ ఎడారికి 'హెల్ ఆన్ ఎర్త్' (భూతల నరకం) అనే పేరును తీసుకు వచ్చాయి. ఎటు చూసినా ఇసుక దిబ్బలతో కనిపించే దాన్ని కదా ఎడారి అంటారు. కాని డనాకిల్ ఎడారి అందుకు భిన్నంగా వివిధ రంగుల్లో వింతగా మెరిసిపోతూ ఉంటుంది. భూగర్భంలో వివిధ ఖనిజాలను కరిగించుకుని ఉబికి వచ్చే వేడి నీరు, తరచూ అగ్ని పర్వతాలు పేలడం వల్ల ఏర్పడిన లావా సరస్సులు ఈ రంగులకు కారణం.



## బాంబుల బీటిల్

దక్షిణ ఐరోపా, ఉత్తర అమెరికాలలో విరివిగా కనిపించే ఈ కుమ్మరి పురుగు తనకన్నా పెద్ద శత్రువు పైకి కూడా బాంబులు వేసి భయపెట్టగలదు. ఓ చిన్న పురుగుకు ఇదెలా సాధ్యం అంటారేమో... దీని కడుపులో రెండు ప్రత్యేకమైన రిజర్వాయర్లు ఉంటాయి. ఒకదానిలో 'హైడ్రోక్వినోన్' అనే రసాయనం ఉంటే, మరో రిజర్వాయరులో 'హైడ్రోజన్ పెరాక్సైడ్' ఉంటుంది. ఇవి రెండూ కలిసినప్పుడు రసాయన చర్య ప్రారంభమై నీళ్లను మరిగించే స్థాయి ఉష్ణోగ్రతలో ఓ రసాయనం తయారవుతుంది. దానిని శత్రువులపైకి స్ప్రే చేసి వాటి బారి నుంచి తప్పించుకుంటుందీ బీటిల్. బాంబు పేలినప్పుడు వెలువడినట్టే ఈ స్ప్రే ద్వారా వేడి, పొగ ఉత్పత్తి అవుతాయి కాబట్టి జీవ శాస్త్రవేత్తలు దీనికి 'బొంబార్డియర్ బీటిల్' అని పేరు పెట్టారు.






## బుల్లి సినిమా డైరెక్టర్

సౌగత్ బిస్తా అనే నేపాలీ పిల్లాడు 'లవ్ యు బాబా' అనే సినిమాకు దర్శకత్వం వహించి అతి పిన్న వయస్కుడైన డైరెక్టర్‌గా గిన్నిస్‌బుక్‌లో చోటు సంపాదించాడు. కేవలం 7 సంవత్సరాల 340 రోజుల వయసులో 138 నిమిషాల నిడివి గలిగిన సినిమాని తెరకెక్కించాడు. పుట్టుకతోనే తల్లిని పోగొట్టుకున్న ఓ అమ్మాయికి, ఆమె తండ్రికి మధ్య అనుబంధాన్ని చిత్రించిన ఈ సినిమా 27 రోజుల్లోనే షూటింగ్ పూర్తి చేసుకోవడం విశేషం. సౌగత్ బిస్తా తండ్రి గజిత్ బిస్తా నేపాలీ సినీ నటుడు. అతని దగ్గరే డైరెక్షన్ పాఠాలు నేర్చుకున్నాడట ఈ బుడతడు.



## ది నట్ జాబ్ 2

ఈ వేసవిలో మిమ్మల్ని అలరించేందుకు ముస్తాబవుతోంది డ్రీమ్‌వర్క్స్ యానిమేషన్ సంస్థ వారి త్రీడీ యానిమేషన్ మూవీ 'ది నట్ జాబ్ 2 : నట్టీ బై నేచర్'. దీని కథేంటంటే ఆక్టన్ నగర మేయర్ ఆ నగరంలోని లిబర్టీ పార్కుని ఎమ్యూజ్‌మెంట్ పార్కుగా మార్చాలని ప్రయత్నాలు ప్రారంభిస్తాడు. ఆ విషయం తెలుసుకున్న పార్కులోని చిన్న చిన్న జంతువులు సర్లీ అనే ఉడతను నాయకుడిగా ఎన్నుకుని మేయర్ ప్రయత్నాలను అడ్డుకుంటాయి. ఆ ప్రయత్నంలో బుల్లి జంతువులు చేసే విన్యాసాలను వెండితెరపై చూసి తీరాల్సిందే!




## బుచికి








కె.త్రిశాలరెడ్డి
6వ తరగతి, సెయింట్ జోసఫ్స్ ఇంగ్లీషు స్కూల్, కర్నూలు

## మీకు తెలుసా!

- ఒక చెట్టు నుంచి 1 లక్ష 70 వేల పెన్సిళ్లను తయారు చేయవచ్చు.
- 1660 వరకూ గడియారాల్లో గంటల ముల్లు ఒకటే ఉండేది.
- వ్యోమగాములు తెల్లని దుస్తులే ధరించడానికి కారణం అవి కాంతిని పరావర్తనం చెందించి శరీర ఉష్ణోగ్రత పెరగకుండా చేస్తాయని.
- తేలు ఊపిరి బిగబట్టి ఆరురోజుల వరకూ ఉండగలదు.
- గురుత్వాకర్షణ లేనందున అంతరిక్షంలో పడుకున్న వారు గురక పెట్టలేరు.





ప్ర : ఇక్కడ కనిపిస్తోన్న బస్సు కుడివైపు వెళుతుందా? ఎడమ వైపు వెళుతుందా?

జ : తలుపు కనిపించడం లేదు కాబట్టి కుడివైపు వెళుతుంది.

## చుక్కలు కలపండి





# అనుగ్రహం

19-25 మార్చి 2017

డాక్టర్ పి.ఎ. రామన్


మేషం

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం**

ఆది, సోమ వారాల్లో దుబారా ఖర్చులు. ఒక సంఘటన మీపై ప్రభావం చూపుతుంది. స్థిమితంగా ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. గృహ మార్పునకు యత్నాలు సాగిస్తారు. దంపతుల మధ్య దాపరికం తగదు. చిన్ననాటి పరిచయస్తులను కలుసుకుంటారు. ఆంతరంగిక విషయాలు వెల్లడించవద్దు. అప్రియమైన వార్తలు వినవలసి వస్తుంది.


తుల

**చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు**

రుణయత్నాలు ఫలిస్తాయి. శుభకార్యాలను ఘనంగా చేస్తారు. పరిచయాలు విస్తరిస్తాయి. వ్యూహాత్మకంగా వ్యవహరించండి. ఆరోగ్యం కుదుటపడుతుంది. కుటుంబీకులతో ఉల్లాసంగా గడుపుతారు. కలిసివచ్చిన అవకాశాన్ని తక్షణం వినియోగించుకోండి. నగదు, విలాస వస్తువులు జాగ్రత్త. ప్రముఖులతో సంప్రదింపులు జరుపుతారు. విద్యార్థులకు అత్యుత్సాహం తగదు.


వృషభం

**కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు**

అనుకున్న లక్ష్యాన్ని సాధిస్తారు. పనులు నిదానంగా పూర్తి కాగలవు. కొంత మొత్తం ధనం అందుతుంది. అభిమానించే వ్యక్తులను కలుసుకుంటారు. సంప్రదింపుల్లో మీ అభిప్రాయాలను కచ్చితంగా తెలియజేయండి. ఆరోగ్యం నిలకడగా ఉంటుంది. ఉద్యోగస్తులకు శుభదాయకం. వ్యాపారులకు లాభం. సేవా కార్యక్రమాల్లో పాల్గొంటారు.


వృశ్చికం

**విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ**

ఈ వారం రుణ సమస్యలు తొలగుతాయి. గృహంలో సందడి నెలకొంటుంది. బంధువులతో సంబంధాలు బలపడతాయి. కొత్త యత్నాలకు శ్రీకారం చుడతారు. సంప్రదింపులు, ఒప్పందాలతో తీరిక ఉండదు. పూర్వ విద్యార్థులతో ఉల్లాసంగా గడుపుతారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. దంపతుల మధ్య అవగాహన నెలకొంటుంది. వ్యాపారాలు ఊపందుకుంటాయి.


మిథునం

**మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు**

వ్యవహారాలు సజావుగా సాగుతాయి. చక్కని ప్రణాళికలు రూపొందించుకుంటారు. ఖర్చులు అధికం, ప్రయోజనకరం. నగదు లావాదేవీల్లో జాగ్రత్త. తొందరపడి చెల్లింపులు జరపవద్దు. సన్నిహితులకు సాయం అందిస్తారు. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. కొత్త పరిచయాలేర్పడతాయి. రచయితలు, క్రీడాకారులకు ప్రోత్సాహకరం.


ధనుస్సు

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం**

ప్రణాళికాబద్ధంగా పనులు పూర్తి చేస్తారు. అంచనాలు ఫలిస్తాయి. విలాస వస్తువులు కొనుగోలు చేస్తారు. పొదుపు పథకాలు, పెట్టుబడులకు అనుకూలం. పత్రాలు, రశీదులు జాగ్రత్త. వ్యవహార ఒప్పందాల్లో ఏకాగ్రత వహించండి. స్తోమతకు మించి హామీలు ఇవ్వవద్దు. ఆత్మీయుల సాయంతో ఒక సమస్య పరిష్కారమవుతుంది. ఉద్యోగస్తులకు పదవీయోగం.


కర్కాటకం

**పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష**

శుభవార్తలు వింటారు. కొన్ని అవకాశాలు కలిసి వస్తాయి. ధనప్రాప్తి, వస్తులాభం. పనులు అనుకున్న విధంగా పూర్తి కాగలవు. అయిన వారితో ఉల్లాసంగా గడుపుతారు. పదవుల స్వీకరణకు అనుకూలం. మంగళ, శని వారాల్లో ప్రత్యర్థులతో జాగ్రత్త. ఎవరినీ అతిగా విశ్వసించవద్దు. సంతాన భవిష్యత్తుపై శ్రద్ధ అవసరం. నిరుద్యోగుల కృషి ఫలిస్తుంది.


మకరం

**ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ట 1,2 పాదాలు**

కష్టానికి తగ్గ ఫలితం ఉంటుంది. ఖర్చులు సామాన్యం. అవసరాలు, కోరికలు నెరవేరుతాయి. విమర్శలు, అభియోగాలకు దీటుగా స్పందిస్తారు. మీ మాటతీరు ఆకట్టుకుంటుంది. ఆలోచనలు నిలకడగా ఉండవు. మంగళ, బుధ వారాల్లో పనుల ప్రారంభంలో చికాకులెదురవుతాయి. దంపతుల మధ్య అన్యోన్యత నెలకొంటుంది. ఉద్యోగ బాధ్యతల్లో మార్పులుంటాయి.


సింహం

**మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం**

రాబోయే ఆదాయానికి తగ్గట్టుగా ఖర్చులు సిద్ధంగా ఉంటాయి. ఆపత్సమయంలో ఆత్మీయులు చేయూతనిస్తారు. గురు, శుక్ర వారాల్లో ఆందోళన కలిగించే సంఘటనలెదురవుతాయి. పరిస్థితులకు అనుగుణంగా మెలగాలి. మీ ఆధిపత్యం ప్రదర్శించవద్దు. పోగొట్టుకున్న పత్రాలు తిరిగి పొందుతారు. ద్విచక్రవాహనంపై దూర ప్రయాణం క్షేమం కాదు.


కుంభం

**ధనిష్ట 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు**

లక్ష్య సాధనకు అవిశ్రాంతంగా శ్రమిస్తారు. అవకాశాలు చేజారినా ఒకందుకు మంచిదే. మీ కృషి త్వరలోనే ఫలిస్తుంది. ఆచితూచి వ్యవహరించండి. గురు, శుక్ర వారాల్లో పనులు నిదానంగా సాగుతాయి. ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. శుభకార్యాలు, వేడుకలకు హాజరవుతారు. పెద్ద మొత్తంలో ధన సహాయం క్షేమం కాదు. స్థిరాస్తి అమర్చుకునే దిశగా ఆలోచిస్తారు.


కన్య

**ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు**

రాబడికి మించి ఖర్చులుంటాయి. అవసరాలు, చెల్లింపులు వాయిదా వేసుకుంటారు. లౌక్యం అవసరం. ఎదుటివారి ఆంతర్యం గ్రహించండి. కుటుంబ, ఆర్థిక విషయాలు గోప్యంగా ఉంచండి. నోటీసులు అందుకుంటారు. గృహ నిర్మాణంలో అభ్యంతరాలెదురవుతాయి. ఆరోగ్యం, సంతానం భవిష్యత్తు పట్ల శ్రద్ధ అవసరం. సంగీత, నృత్య కళాకారులకు ప్రోత్సాహకరం.


మీనం

**పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి**

ఆశావహదృక్పథంతో యత్నాలు సాగించండి. సమర్థతకు ఆలస్యంగా గుర్తింపు లభిస్తుంది. ప్రతి విషయంలోనూ ఆచితూచి వ్యవహరించాలి. సొంత నిర్ణయమే శ్రేయస్కరం. గృహమార్పు కలిసివస్తుంది. ప్రియతముల గురించి ఆందోళన చెందుతారు. సామరస్యంగా వివాదాలు పరిష్కరించుకోవాలి. పట్టుదలకు పోవటం వల్ల సమస్య పరిష్కారం కాదని గమనించండి.

# హెర్పిస్ ఛాయలే ఉండవు

**ఒక** గుండు సూది గుండుమీద కోటి వైరస్‌ల దాకా ఇమిడిపోయేంత సూక్ష్మమైన వైరస్ ఇది. జీవింతాంతం బాధించే ఈ వైరస్‌ను హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ అని అంటారు.

### రెండు రకాలు

హెచ్ఎస్‌వి 1 : ఇది నోటి దగ్గర పొక్కులరూపంలో బయటపడుతుంది. పెదవుల చుట్టూ తెల్లని నీటిపొక్కులలాగా కనిపిస్తుంది. ఇది ముఖ్యంగా తల్లిదండ్రులు, తోటి పిల్లల నుంచి వ్యాపిస్తుంది. ఎక్కువగా పిల్లలలో కనిపిస్తుంది. సాధారణంగా ఇవి వచ్చిపోతూ ఉంటాయి.

హెచ్ఎస్‌వి 2 : జననావయవాల దగ్గర పొక్కులతో బయటపడుతుంది. దీన్ని జెనిటల్ హెర్పిస్ అని అంటారు. చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి పగిలిపోతుంటాయి.

హెర్పిస్ వైరస్ పురుషుల నుంచి స్త్రీలకు, స్త్రీల నుంచి పురుషులకు లైంగిక సమయంలో వ్యాప్తి చెందుతుంది. లైంగిక కలయిక సమయంలో చర్మం చిట్లినపుడు గాయాలు, పుండ్ల ద్వారా ఈ వైరస్ వస్తుంది. ఈ చర్మం చిట్లినపుడు వైరస్ లోపలకు ప్రవేశిస్తుంది. ఈ వైరస్ కొద్ది రోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది. ఈ వైరస్ వెన్నెముక చివరిభాగం శాక్రమ్ చుట్టూ ఉండే నాడుల సముదాయంలో చోటు చేసుకుని నిద్రావస్థలో ఉండిపోతుంది. ఈ నిద్రాణస్థితిలో ఎలాంటి లక్షణాలు చూపించకుండా అవసరమైనపుడు తన ప్రతాపాన్ని చూపించి అతలాకుతలం చేస్తుంది.

### ఎలా గుర్తుపట్టాలి

ఒళ్లంతా నొప్పులు, గజ్జలలో, చంకలలో గడ్డలు కట్టినట్లుగా ఉంటుంది. తరువాత క్రమక్రమంగా లైంగిక భాగాలపై చిన్న చిన్న నీటిపొక్కులు కనిపిస్తాయి. రెండు, మూడు రోజులలో పగిలి పుండ్లలాగా తయారవుతాయి. ఈదశలో రోగికి సమస్య వచ్చినట్లు తెలుస్తుంది. తొలిసారి లక్షణాలు కనిపించినపుడు సరియైన చికిత్స తీసుకుంటే ప్రారంభదశలోనే సత్వరనివారణ జరుగుతుంది. కానీ చాలా మందిలో వైరస్ ఉండిపోవడం వల్ల నిదానంగా ఉంటూ తిరగి బయటపడుతూ ఉంటుంది. దీన్ని హెర్పిస్ రికరెంట్ అటాక్ అని అంటారు.


**డా. మధు వారణాశి,** ఎం.డి

ప్రముఖ హోమియో వైద్యులు

ప్లాట్‌నెం 188, వివేకానందనగర్ కాలనీ,

కూకట్‌పల్లి, హైదరాబాద్

ఫోన్ : 8897331110

8886 509 509




### హెర్పిస్ రికరెంట్ అటాక్స్

వాతావరణ పరిస్థితుల్లో ఉన్న తీవ్రమైన తేడాలు, మానసిక ఆందోళన వల్ల హెర్పిస్ రికరెంట్ అటాక్స్ వస్తాయి. దీనిలో లక్షణాల తీవ్రత అంతగా లేకపోయినా కొన్నిరోజులలో పుండ్లు మానిపోయి సాధారణంగానే ఉంటుంది. నీటి పొక్కులు చితికి పుండ్లుగా మారినపుడు హెర్పిస్ వైరస్ పుండు రసిలో ఉంటుంది. ఈ సమయంలో రతిలో పాల్గొంటే భాగస్వామికి అంటుకునే అవకాశం ఉంది. స్త్రీలలో నెలసరి సమయంలో చిన్న చిన్న పొక్కులు ఉన్నా తెలియవు. వీరికి హెర్పిస్ ఉన్నట్లు తెలియకపోయినా, లోలోపల హెర్పిస్ ఉండే అవకాశం ఉంటుంది.

### హోమియో చికిత్స

లైంగిక వ్యాధులలో హోమియో చికిత్స కీలక పాత్రపోషిస్తుంది. శాస్త్రీయతను సంతరించుకున్న హోమియో చికిత్స మూలకారణాన్ని గుర్తించి దానితొలగించడంలో కృషి చేస్తుంది. రోగనిరోధక వ్యవస్థను పెంచి రోగనివారణకు సరియైన మార్గాన్ని చూపిస్తుంది. పొక్కులు కనిపించగానే చికిత్స తీసుకోవాలి. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని దగ్గర చికిత్స తీసుకుంటే హెర్పిస్ ఇట్టే తొలగిపోతుంది.

# పైల్స్ బాధ ఇలా పోయింది

**ఒకేచోట** కదలకుండా కనీసం పది నిమిషాలైనా కూర్చోకుండా కుర్చీలో అటు ఇటు కదిలే వారిని చూస్తే పక్కవారికి కాస్త చిరాకుగానే ఉంటుంది. కానీ అది పైకి చెప్పలేని బాధ. ఇంతగా బాధించే వ్యాధి పేరే పైల్స్. కానీ అది పైకి చెప్పలేని బాధ. జీవనశైలిలోమార్పుల వల్ల ఇప్పుడు పైల్స్ సమస్యలు పెరుగుతున్నాయి. హెమరాయిడ్స్‌ని సామాన్య పరిభాషలో పైల్స్ అంటారు. దీనినే తెలుగులో మొలలు అంటాం. ఈ వ్యాధి అసౌకర్యాన్ని కలగిస్తుంది. తప్పితే సాధారణంగా ప్రాణ ప్రమాదాన్ని కలిగించదు. మలద్వారం లోపల సిరలు ఉబ్బిపోయి పెద్దవిగా మారటాన్ని పైల్స్ అంటారు. సరైన ఆహార నియమాలు పాటించకపోవడం, తీవ్రమైన మానసిక ఒత్తిళ్లు, నీరు తక్కువగా ఉండటం, మద్యం అతిగా సేవించడం, మాంసాహారం తరచుగా తినడం వీటివల్ల పైల్స్ వచ్చే అవకాశాలు ఎక్కువ. దాదాపు ప్రతివారికి జీవితంలో ఏదో ఒక సందర్భంలో పైల్స్ ఇబ్బంది పెడతాయి. పైల్స్ ఏర్పడటానికి ప్రధాన కారణం మలవిసర్జన సజావుగా, నిరాటంకంగా దానంతట అదే జరగకపోవడం. మలవిసర్జన త్వరత్వరగా జరిగిపోవాలనే భావంతో ముక్కటం, మలద్వారపు కండరాలను బిగపట్టడం చేస్తే మలద్వారం, లోపలి రెక్టల్ సిరల మీద ఒత్తిడి పెరిగి పైల్స్‌గా ఏర్పడతాయి. ఒత్తిడి పెరిగే కొద్దీ సిరల్లో రక్తం ఎక్కువగా పోటేసి గోడలను ఉబ్బిపోయేలా చేస్తుంది. మలవిసర్జన సాఫీగా జరగదు. తీవ్రమైన నొప్పి, రక్తస్రావం, మంట ఉంటాయి. అప్పుడప్పుడు రక్తం పడుతుంది. మలవిసర్జన అనంతరం కూడా కొందరిలో నొప్పి, మంట రెండుగంటల వరకు ఉంటుంది. మలవిసర్జన సమయంలో మొలలు బయటకు పొడుచుకుని వచ్చి బాధిస్తాయి. దీనిని రెండు రకాలుగా విభజించవచ్చు. ఇంటర్నల్ పైల్స్, ఎక్స్‌టర్నల్ పైల్స్. ఒకే సమయంలో రెండు రకాలుగా ఉండవచ్చు. తీవ్రతను బట్టి ఇంటర్నల్ పైల్స్ నాలుగు దశలుగా ఉంటుంది. మొదటి దశలో మలద్వారం నుంచి మొలలు బయటకు రావు. రెండవ దశలో మలవిసర్జన సమయంలో బయటకు వచ్చి తర్వాత లోపలకు వెళ్లిపోతాయి. మూడవ దశలో మలవిసర్జన తరువాత వాటంతట అవే లోపలికి వెళ్లవు. నాలుగవ దశలో మొలలు ఎల్లప్పుడు మలద్వారం బయటే ఉంటాయి. ఎక్స్‌టర్నల్ పైల్స్‌లో ప్రధాన లక్షణం నొప్పి. మల విసర్జన సమయంలో రక్తస్రావం, దురద ఉంటుంది.

**నాపేరు చంద్రశేఖర్. కార్పొరేట్ కంపెనీలో హెచ్‌ఆర్‌గా పనిచేస్తున్నాను. నా ఆహారపు అలవాట్లు, మానసిక ఒత్తిడి వల్ల నాకు పైల్స్ సమస్య వచ్చింది. సర్జన్ చూపిస్తే ఆపరేషన్ ఒక్కటే మార్గమన్నారు. ఆపరేషన్ అంటే భయం వేసి డా. వారణాసిగారిని కలిశాను. ఫస్ట్‌డోస్‌తోనే నాకు నొప్పి, బ్లీడింగ్ తగ్గిపోయింది. ఒకనెల తరువాత సమస్యలన్నీ తగ్గిపోయాయి. ఎంతో ప్రశాంతంగా జాబ్‌కు వెళుతున్నాను. 6 నెలలు ట్రీట్‌మెంట్ కంటిన్యూ చేశాను. ఇప్పుడు నాకు పైల్స్ ఉన్నాయనే విషయం మరిచిపోయాను. థాంక్స్ టూ వారణాసి**

**- చంద్రశేఖర్, మాదాపూర్**

### ఏం చేయాలి?

పీచుపదార్థాలు ఎక్కువగా ఉన్న ఆహారం తీసుకోవాలి. నీరు ఎక్కువగా తాగాలి. ప్రతిరోజు వ్యాయామం చేయాలి.మద్యం, ఫాస్ట్‌ఫుడ్, వేపుళ్లు, మాంసాహారం మానేయాలి. మానసిక ఒత్తిడి నివారణకు యోగా, వ్యాయామం చేయాలి. గ్రీన్‌వెజిటబుల్స్, లీప్స్ తీసుకోవాలి. ఎందుకంటే వీటిలో పీచుపదార్థాలు అధికంగా లభిస్తాయి. ఇది మలబద్ధకాన్ని నివారిస్తుంది. అలాగే బీన్స్, సోయాబీన్స్, బ్లాకబీన్స్ లాంటివి తేలికగా జీర్ణమై పేగులు శుభ్రపడేలా చేస్తాయి. మామిడి, నిమ్మ, బొప్పాయి మొదలైన పండ్ల రసాలు తీసుకోవాలి. కాఫీ, టీ బాగా తగ్గించాలి.

# ఉగాది మిఠాయి పొట్లం

సాహిత్య ప్రియులకు రాజాచంద్ర ఫౌండేషన్ తరపున సంపాదకులు అందించిన ఉగాది కానుక 'నవ్యాంధ్ర సాహిత్య సంచిక'. ఒకనాటి యువ దీపావళి ప్రత్యేక సంచికను తలపించేలా వడ్డాది పాపయ్య ముఖచిత్రంతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దారు. సుమారు ఇరవై కథలు, డజను మంది ప్రముఖులతో ఇంటర్వ్యూలు, వ్యాసాలు, మరెన్నో కవితలు .. వెరసి సంపాదకులన్నట్లు నిజంగా ఇది సాహిత్య మిఠాయి పొట్లమే. పేరుకు నవ్యాంధ్ర అయినా ఇటు తెలంగాణతో పాటు అటు ప్రవాసాంధ్రులకూ చోటు కల్పించి, దళిత, బహుజన, మైనారిటీ రచయితలను కలుపుకుని సాహిత్యం సార్వజనీనమని చాటుకున్నారు. ముఖ్యంగా వి.ఎ.కె. రంగారావుతో డా.ఆర్.భార్గవి చేసిన సుదీర్ఘమైన ఇంటర్వ్యూ ద్వారా ఎన్నో ఆసక్తికరమైన సినిమా విశేషాలు తెలిశాయి. అలనాడు విశాఖపట్నంలోని జగదాంబ సెంటర్లో వంగపండు పాడిన 'ఏం పిలడో ఎల్ద మొస్తవా ..' పాటకు శ్రీశ్రీ చిందేసిన సందర్భాన్ని గౌరునాయుడు వంగపండుతో చెప్పించారు. గొప్ప అనువాదకులు, రచయిత డా.ఎం.వి. రమణారెడ్డి రాజకీయ తెరవెనక జీవితాన్ని పాలగిరి విశ్వప్రసాద్ పారదర్శకంగా పాఠకులకు అందించారు.

**- తహిరో**




**నవ్యాంధ్ర సాహిత్య ప్రత్యేక సంచిక**
**సం :** సాకం నాగరాజ, గంగవరం శ్రీదేవి
**పేజీలు :** 136, **వెల :** రూ. 100 **ప్రతులకు :** 94403 31016

కొత్త పుస్తకాలు

# సాహితీ దిగ్గజం జీవీకే

జీవీకేగా సాహిత్యాభిమానులు పిలుచుకునే గవిని వెంకట కృష్ణారావు బహుముఖ ప్రజ్ఞాశాలి. మార్క్సిస్టు దృక్పథ విమర్శకులు. కేవలం బీఏ పట్టాతోనే పింగళి సూరన కళాపూర్ణోదయం మీద ఆంగ్లంలో పీహెచ్‌డీ గ్రంథం సమర్పించి మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టా పొందారు. ఇప్పటివరకూ మరెవరికీ బీఏ పట్టా మీద డాక్టరేట్ రాలేదంటే జీవీకే ఘనత ఏమిటో అర్థమవుతుంది. జీవీకే శత జయంతి (2015) సందర్భంగా ఆయన అభిమానులు, శిష్యులు కలిసి ఈ ప్రత్యేక సంస్మరణ సంచికను వెలువరించారు. జీవీకే సన్నిహితులు, శిష్యులతో పాటు ప్రముఖ రచయితలు రాసిన వ్యాసాలు ఈ సంచికలో ఉన్నాయి. ఆయన జీవిత విశేషాలతో పాటు సాహితీకారుడిగా, విమర్శకుడిగా, తాత్వికుడిగా ఆయన తన భావ జాలాన్ని ఏ విధంగా ప్రచారం చేశారో ఈ వ్యాసాల్లో వివరంగా చర్చించారు. జీవీకే రచించిన 'జఘనసుందరి' ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతం నేపథ్యంగా సాగుతూ మానవ ప్రవర్తనలోని వైరుధ్యాలను, సంఘర్షణనూ చిత్రించిన నవల. ఈ నవల విశిష్టతను మరో వ్యాసంలో చర్చించారు. భవిష్యత్తులో వారి రచనా సర్వస్వాన్ని కూడా తీసుకువస్తే బాగుంటుంది.

**- చందు**




**డా. జీవీకే శతజయంతి సంస్మరణ సంచిక**
**పేజీలు :** 390, **వెల :** రూ.500
**ప్రతులకు :** వెలగా మానవేంద్ర, 92905 38006

# ప్రపంచం ఒక పుస్తకరూపంలో!

ఆదినారాయణ జగమెరిగిన యాత్రికుడు. ప్రయాణించడమే జీవితమని నమ్మినవాడు. ఆయన పద్నాలుగు దేశాల ప్రయాణానుభవాలే ఈ పుస్తకం. ట్రావెలాగ్ అంటే చాలామంది ఆయా దేశాల వింతలు, విడ్డూరాలు, కట్టడాల గురించి వివరిస్తుంటారు. అయితే అవన్నీ మనకు ఇంటర్‌నెట్‌లో కూడా దొరుకుతాయి. కానీ ఆయా దేశాల్లో ఉండే వ్యక్తులు, అభిమానాలు, ఆప్యాయతలు ఇవి గూగుల్ సెర్చ్‌లో దొరకవు. ఆదినారాయణ ప్రత్యేకత ఇదే. ఆయా దేశాల పరిచయం కంటే అక్కడి మనుషులతో ఉండే అనుబంధాన్నే ఎక్కువ వివరిస్తారు.

నైజీరియా గురించి మనకు తెలుసు. కానీ పాట కోసం ప్రాణాలు పణంగా పెట్టిన ఫేలాకూటి గురించి తెలియదు. మిలట్రీ పాలకులు తల్లిని హత్య చేస్తే, ఆమె శవాన్ని మిలట్రీ కార్యాలయం ముందు ఉంచి పాటతో నిరసన తెలిపిన మహాగాయకుడు. ఇలా కొత్త ప్రపంచాన్ని మనకి ఆదినారాయణ పరిచయం చేస్తారు. స్వతహాగా సంగీతాన్ని, చిత్రలేఖనాన్ని ఇష్టపడతారు కాబట్టి ఈ పుస్తకంలో ఎక్కువమంది సంగీతకారులు, ఆర్టిస్టులు మనకు పరిచయం అవుతూ ఉంటారు.

ఉన్న చోటే ఉండిపోతే మనిషికి నాగరికతే లేదు. ప్రయాణమే మనిషి జీవనగతిని మార్చేది. నిరంతర యాత్రికుడు ఆదినారాయణ ఈ పుస్తకం ద్వారా మనం చూడని ప్రపంచాన్ని చూపించారు. ప్రయాణాల్ని ఇష్టపడేవాళ్లంతా చదవాల్సిన పుస్తకం ఇది.

**- జి.ఆర్.మహర్షి**

**భూభ్రమణ కాంక్ష** - ఎం. ఆదినారాయణ
**పేజీలు :** 385, **వెల :** రూ.250
**ప్రతులకు :** 98498 83570

ఇవీ వచ్చాయి

**గతితప్పిన గమ్యం**
రచన : ఎడమ శ్రీనివాసరెడ్డి
**పేజీలు :** 216, **వెల :** రూ.120

**మహాప్రయాణం**
రచన : పి. చంద్రశేఖర అజాద్
**పేజీలు :** 216, **వెల :** రూ.120

**పిల్లల చదువు పేరెంట్స్ బాధ్యతే!**
(నేటి తరం రేపటి తరానికి జవాబుదారీ)
రచన : అలజంగి ఉదయకుమార్
**పేజీలు :** 182, **వెల :** రూ.150
**ప్రతులకు :** రచయిత పేరు, 2-10-15, మిండి, విశాఖపట్నం

**రోజుకో నీతి కథ**
రచన : పి. రాజేశ్వర రావు
**పేజీలు :** 350, **వెల :** రూ.250

**గణితంతో వినోదం**
రచన : యాకోవ్ పెరెల్మాన్
**అనువాదం :** పి. రాజేశ్వర రావు
**పేజీలు :** 118, **వెల :** రూ.80
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**పనామా బీచ్‌లో...**
రచన : తరానా
**పేజీలు :** 124, **వెల :** రూ.100
**ప్రతులకు :** 040-2767 8430

**అత్యాధునిక కవితా రూప ప్రక్రియ- నానీ**
రచన : చలపాక ప్రకాష్
**పేజీలు :** 352, **వెల :** రూ.87
**ప్రతులకు :** 91770 13845

**గండికోట రహస్యం** (ప్రపంచ ప్రఖ్యాత పెమ్మసాని కమ్మరాజుల వైభవం)
రచన : అలపర్తి పిచ్చయ్య చౌదరి
**పేజీలు :** 108, **వెల :** అమూల్యం
**ప్రతులకు :** 91770 13845

**విధ్వంసం**
రచన : సింహ ప్రసాద్
**పేజీలు :** 168, **వెల :** రూ.90

**మనోదాహం**
రచన : వి. రాజారామమోహనరావు
**పేజీలు :** 136, **వెల :** రూ.70
**ప్రతులకు :** నవతెలంగాణ, ప్రజాశక్తి

